

పూజ్యా వినోబాజీ
ఫిబ్రవరి 6 వ తేదీ
సాయంత్రం
హైదరాబాదులో
సాహిత్యగోష్ఠిలో
ఉపన్యసించారు.

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide. Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

---

## ఈ సంచికలో





# స్రవంతి - సూచనలు

1. స్రవంతి ప్రతినెల 10 వ తేదీన చందాదార్లకు పంపబడును.
2. ఉత్తర ప్రత్యుత్తరములు జరుపునపుడు ప్రతి చందాదారూ తనకు నిర్ణయింపబడిన సంఖ్యనుగూడా తెలియ జేయవలెను.
3. కనీసం మూడునెలలైనా వరుసగాలేనిది చిరునామా మార్పు అంగీకరించబడదు. చిరునామా మార్పును కోరువారు తగినంత ముందుగా కార్యాలయమునకు తెలియజేయవలెను.
4. సమీక్షకు పుస్తకములను పంపువారు రెండు ప్రతులను తప్పక పంపవలెను. పుస్తకములను పంపినవారు వెంటనే సమీక్షను ప్రచురించమని ఉత్తరములువ్రాసి ప్రయోజనం లేదు. వీలువెంబడి అన్ని పుస్తకములూ సమీక్షించబడగలవు.
5. రచయితలు తమ రచనలను కాగితమునకు ఒకవైపుననే వ్రాసి పంపవలెను. అక్షరములు సాధ్యమైనంత స్పష్టంగా ఉండడం గూడా అవసరము.
6. తమ రచనలను తిరిగి పంపమని కోరువారు 0—2—0 తపాలా బిళ్ళలు పంపవలెను.

---

టెలిగ్రామ్: హిందీసంఘ్ ఫోన్: 4406

సంవత్సర చందా
రు. 2-0-0

విడిప్రతి
రు. 0-4-0

# ప్రవంతి

| సంపుటి ౨ | ఫిబ్రవరి, 1956 | సంచిక ౧౧ |
|---|---|---|

*సంపాదకీయం :*

## స్వవిషయం

ప్రవంతిని ప్రారంభించి ఇప్పటికి ఇరవైమూడు నెలలయింది. సక్రమంగా ప్రతినెలా అనుకొన్న తేదీకి ఇంతవరకూ ప్రవంతి వెలువడుతూ వచ్చింది. ఈ సంచిక ఇరవైమూడో సంచిక. ఇంతకాలం పాఠకులు ఎంతో ఆదరాభిమానాలతో ప్రవంతికి తగినంతగా సహాయంచేస్తూ వచ్చారు. కొద్దికాలంలోనే ఈ పత్రిక తెలుగు సాహితీ లోకంలో తగినంత ప్రతిష్ఠను సంపాదించుకొన్నది. పత్రికను ప్రారంభించి నప్పుడు తక్కువకు తక్కువ చందాతో పాఠకులకు అందజేయవలెనని ఆశించాము. కాని ప్రస్తుతమున్న సంవత్సరచందా చాలా తక్కువ కావడంవలన ఆర్థికంగా చాలా నష్టాన్ని భరించవలసి వస్తున్నది. ఈమధ్యకాలంలో ఒకసారి చందాను మూడు రూపాయలకు పెంచవలెనని అనుకొన్నాము, కాని మా సంఘకార్యవర్గంవారు ఇంకొక సంవత్సరం ఇదే విధంగా పత్రికను నడిపి

చూద్దామని నిర్ణయించడం వలన చందాను మార్చలేదు. రెండో సంవత్సరంలోగూడా పత్రికా నిర్వహణలో కలిగిన అనుభవాన్ని అనుసరించి ఈ కొద్దిచందాతో పత్రికను నిర్వహించడం అసంభవ మని నిర్ణయానికి రావలసి వచ్చింది. ఆర్థిక భారంవలన పత్రికలో అవసరమైన మార్పులను తీసుకొని రాలేక పోతున్నాము. కనుక రాబోయే ఏప్రియల్ నెలనుండి రెండు రూపాయల చందాను మూడు రూపాయలకు మారుస్తున్నాము. పాఠకులు యీ మార్పుకు అంగీకరించి మాకు ఇతోధికంగా తోడ్పడగలరని ఆశిస్తున్నాము. ఈ మార్పు మార్చి 31 వ తేదీలోపల చందాదారులుగా చేరేవారికి వర్తించదు. వారికి రెండు రూపాయలకే పన్నెండు సంచికలూ అందజేయ బడగలవు. ఏప్రియల్ నుండి చందాదారులుగా చేరేవారు రు. 3-0-0 లు చెల్లించవలసి ఉంటుంది.

ఈ సూచనను పాఠకులు గమనించగలరనీ, అన్ని విధ ములా మాకు చేయూత నొసంగగలరనీ విశ్వసిస్తున్నాము. విడిప్రతి ధరలో మార్పేమీ లేదు.



కవిత:

# నిశాతపస్వి

— వంగల పార్థసారథి ఆచార్యా

మథియించుము మథియించుము
మథియించుము నామనస్సు మందరగిరివై !
మధుర సుధా సింధువులో
వృథా గరళ మొదవుననెడి భయమేల ప్రభూ !

ఆగక యీగానము కొన
సాగింతును - మృదుల మధుర సంగీత ఝరీ
వేగములో శీర్ణహృదు
ద్వేగమ్ము విషాద మాలపించక మునుపే !

నీ కనుచూపులోఁ గరగి నీరుగమారిన జాలిగుండెతో
మూక తపస్సులో మునిగి పోయెను సామి ! ఉదారతారకల్ ! !
నీకరుణా సుధాకరుని నిర్మల కాంతుల లాలనమ్ములో
లోకములన్నియున్ నిదురతోఁ బులకించిన వో మహాప్రభూ !

ఇట్టి సాంద్ర చంద్రికలు సృజించు నీకు
ఈ సుఖస్వప్న సీమఁ జరించునాకు
సుప్రశాంత నిద్రాముద్రిత ప్రకృతికి
విడని యనుబంధ మీరేయి వెడల నీకు ! !

ఒక్కఁడనే నిలంబడుదు నోప్రభు ! ఉన్నత శైలశృంగమం
దెక్కడ లేని భావము లొకేవిధి నామది నుప్పతిల్లెడిన్ !
దిక్కున దిక్కునం బరులు తీరిచి నీల నభ స్స్వభాస్థలిన్
జుక్కలు నాట్యముల్ సలుపఁ జూతును నీ సముఖమ్మునం బ్రభూ ! !

ఈ రే వెల్గుగతించి యేపగలో రానీ కో ప్రభూ ! సాత్త్విక
స్వారాజ్యాన నమోయిక ప్రజల భావాల్ హారతుల్‌గా భవ
ద్ధీర శ్రీకరుణా కళాభరణ మూర్తింగొల్చు యోగానకున్
దూరంబై హృదయాంతర ప్రకృతి యెంతో క్రుంగనీ కోప్రభూ ! !

ఏ తరుణారుణ ప్రభలో యీ రమణీయ నభ స్సభాస్థలీ
రీతులు మార్చి, తాపమునఁ ద్రేల్చునో యీ యతిలోక దృశ్య సం
ఘాతము ? ఈ విఘాతమునఁ గన్నులకుం గఱపౌచు భావనా
తీత మరుజ్జగ త్పథి నదృశ్యుఁడవై విహరింతువో ప్రభూ ?

అయ్యది నవోదయమ్మొ కా దది శుభోద
యమ్మొ కాదు ! శూన్య ప్రభాతమ్మగుచు, భ
వద్వియోగ విషాదైక వహ్నికీల
లందు భస్మసాత్కృతుఁడ నేనగు దినమ్మ ! !

ఇట్టి నిశా తపోనియమమే నను నీకడ జేర్చునంచు నే
నెట్టులొ భార జీవితము నీడ్చుచు వచ్చుచుఁ గైరవమ్మటుల్
బిట్టుగ నాకనుల్ పగటివేళల మూసి, ప్రతీక్షచేయు చు
న్నట్టిఁడ నోప్రభూ ! ఇక దయంగనుమో కరుణాకర ప్రభూ ! !



శ్రవ్యనాటిక :

# స్వప్నంలో సౌందర్యం

— "ఎల్లోరా"

పాత్రలు

1. రాధ .... రావుభార్య
2. రావు .... రాధ భర్త
3. సుందరి ... ఊహాసుందరి.

సమయం :

*రాత్రి 12 గంటల సమయం !*

*[ కీచురాళ్ల గడబిడలు, దూరాన గుడ్లగూబ ఘూకరింపులూ, వినీ వినిపించని కప్పల బెకబెకల అస్పష్టధ్వానులు !*

*కిటికీలోంచి రయ్ మంటూ గాలి వీస్తూంది ! ఆ గాలికి గోడమీద కేలెండరు లోని కాగితాలు టపటప కొట్టుకుంటున్నాయి !*

*ఇంటి మధ్యగదిలో నీలిరంగు దీపం వెలుగులు ప్రసరిస్తూంది. గదిలో నేలమీద పక్కమీద పిల్లలతో రాధ పడుకునివుంది. ప్రక్కనే మంచంమీద రావు. మంచి నిద్రలో ఉంటాడు :*

*రాధ పెట్టూన్న గుర్రు గట్టిగానే వినపడుతూంటుంది.*

*గోడ గడియారం టంగ్ టంగ్ మంటూ పన్నెండు కొడ్తుంది.]*

సుందరి : చాలులెద్దూ ! ఎంత సేపటినుంచి నీకోసం, నీ రాకకోసం, ఎదురు చూస్తూనుంచున్నాను !

* * * *

రావు : (**ఆతృతగా**) నాకు నీమాటలు, అర్థంకావడం లేదు. నీవు ఎవరు ? నాకోసం నీవు ఎందుకు వేచివున్నావు ? ఎంతసేపటినుంచో వేచివున్న నీకూ, ఈ వ్యక్తికీ ఏం సంబంధం ? చాలా ఆశ్చర్యంగా కనబడుతూందే నీ ప్రశ్న !

* * * *

సుందరి : అవును ! నన్ను నువ్వు ఎవరనీ, నాకోసం అంతసేపటినుంచీ, వేచియుండవలసిన సంబంధం, బంధుత్వం ఏమిటి ? అనీ- గతాన్ని మరచి మతాన్ని విరచి- గీతాన్ని ఆలాపిస్తున్నావు. నీ గీతాలాపనలో అపస్వరాలు-

వినే నాకు తడుతున్నాయి కాని ఆలాపించే నీకుకాదు! నీవు ఎత్తుకున్న స్థాయే అపశ్రుతి! నీవు మీటినమీటే అపభ్రంశము!! అనుకున్న శృతి అందుకోలేదు అసలయిన శృతికి!!!

* * * *

రావు: (*గట్టిగా*) ఆఁ! ఏమిటీ? నా కంఠంలో అపశృతి పలుకుతూందా? నా ఎత్తుగడే అపశృతా? నేను మీటే మీటే అపభ్రంశముగా కనబడుతుందంటావా? ఎవరు? నువ్వెవరు? నా వాణికి శృతులుచెప్పే నువ్వెవరవు? నా ఎత్తులకు ఎత్తులుచెప్పే నీవు ఎవరంటా? విను- (*చిన్నగా నవ్వి*) వినూ.... మేటితంబుర మీటిన త్యాగయ్య వారసుడ్ని. మీసాలు మెలివెట్టి- మేటి వీరులుగ నిలచిన పల్నాటివీరుల వారసుడ్ని! కలంచేత కాలానికీ, గగనానికీ, సంబంధాలు సంతరించి- పెళ్ళిపందిళ్లు వేయించిన కలం తిక్కన్న వారసుడ్ని; అదేకాదు ఎండిన బీడులలో జలతారువన్నెల చిక్కని వరివెన్ను కంకెలకు- చీనీలుకట్ట కొడిపట్టిన తిక్కన్న బంధుపుని! స రి గ మలు- సప్తస్వరాలూ పలికించి- వీణానిక్వణాలకు ముక్కుతాళ్లువోసి- హాయిలుగా సప్తస్వరాలూ పలికించి, కితకితల వాకిట వసంతలక్ష్మి నాట్యపటిమను వెలార్చిన లయబ్రహ్మ స్నేహితుడ్ని! అయినా నీ కెందుకు నా అన్నల సమాచారం? నా గతించిన, గతకాలపు- చిట్టావర్జాలు- జమా ఖర్చులు!

* * * *

సుందరి: (*గట్టిగా*) హాఁ హాఁ హాఁ (*నవ్వు*)

* * * *

రావు: (*ఆవేశంతో*) ఎందుకని ప్రశ్నిస్తుంటే నవ్వుతున్నావేమిటి? చెప్పు? నువ్వెవరవు? ఎవరవు నువ్వు!!

సుందరి: (*సన్నగా ఎత్తుకుని గంభీరంగా మాట్లాడుతుంది*) ఎంతగానో ఆశించి, ఆతృతతో, ఆహ్లాదంతో, ఆశలభావాల, కలయికల- కిలకిలా రావాల- పూత మామిడి పలకరింపులకోసం నేను ఇంతగా ఎంతగా వేచి వేసారి, నీకోసం నీ బంధుత్వపు మమకారంతో ప్రయాణాల బడలికల కలయికల బాటలలో పడి పరుగున, ఉరుకున, ఉత్సుకతతో వస్తే....? (*కొంచం ఆగి*) హాఁ! ఎవరనా? నీ ప్రశ్న! ఏం మాట్లాడవు! నిన్నే! నిన్నే!!

* * * *

రావు : (ఆశ్చర్యంతో) ఏమిటీ ! నువ్వు నాకోసం, ఆహ్లాదంతో, ఆవేశంతో వచ్చావా ? మన రక్తం మన బంధుత్వాన్ని సూచిస్తూ ప్రతిధ్వనిస్తూంటే వినపడడం లేదేమిటని అడుగుతున్నావా ? (కొంచెం నిశ్శబ్దం) (అత్రుత- ఆశ్చర్యం) ఆఁ ! ఏమిటి ! ఏమిటదీ.... నీచూపు, నీరూపు, నీతీరూ, నీకంఠం, ఎక్కడో, ఏనాడో, విన్నట్లే, కన్నట్లేవుండే ? (కొంచం స్థాయిని తగ్గించి) అచ్చే ! లేదు ! ముమ్మాటికీ లేదు. నీ మాటలు నాలో ఈ బెల్లా పరుగులు పెడ్తుంటే, నాలో ఏమిటో తప్పు అంచనాలు రాజ్యం ఏలుతున్నాయి. రాగిమూకుడు కుంచులాగి ధ్వనిచేసి అసత్యాన్ని సత్యంలాగ ఆలాపిస్తుంటే ప్రవహించే ఎర్రని రక్తం, భయానికి బందీగా- దానిసత్వానికి దాసీగా భయంతో సుడులుతప్పి, గతులుమరిచి నడకసాగించే పాత్ర. పాము నోటిలో పడ్డట్లు నీ మాటల ప్రవాహం నా హృదంతరాళంలో కనుపించని అంతరాంతరాల నరాల నాళ్రాళ్ళలో ధ్వనితో దారితప్పించి ఓ బాటసారీ ! తప్పావాదాట ? అని వెక్కిరింతల పలకరిస్తున్నాయి ! అంతకన్నా ఏంలేదు ! ముమ్మాటికీ కాదు. నువ్వు నన్ను నీ అందంతో బంధించి, నా పవిత్ర హృదయ సామ్రాజ్యంలో రాణీగా రాజ్యం ఏలుదా మనుకుంటున్నావా ?

* * * *

సుందరి : (బిగ్గరగా నవ్వి) చూడు ! నన్ను నీ రెండునయనాల చిరుకొలకుల గాఢవాడిపటిమతో, పరీక్షించి పలకరించు ! ఇటుచూడు ! ఈ కట్టు, ఈబొట్టు, ఈ చూపులు, ఈ విరుపులూ, ఈ తలపాపిడి, రాపిడి- ఈ అలంకారాల కుంచెల రంగరింతలూ, ఈ నాగరికతా- చూసీ చూడకుండా ఎందుకలా భయంతో ఒణికిపోతావు ? మంచుదిన్న నాల్కలాగ ఎందుచేత నలా కుందించుకు పోతావు ?

* * * *

రావు : (ఆశ్చర్యంగా) ఆఁ ! నీవు.... నీవేనా ! ఇంతలో యింతమార్పా ....... ఏమిటీ.... మాయ ! ఇంతదాకా నీలో రాతినలుపు, గొంతు, ఒక్క పెదిమల కదిలికే- వినపడిన మాటలు తప్ప ఈ రూపు అంతగా గోచరించ లేదే ! ఆహా ! ఏమి అందం ! సుందరీ........ ఒక్కమాట ! ఒక్కచూపు........! (కొంచం ఆగి) పొరపాటు సుందరీ ! నీవు నన్ను అర్ధరాత్రిలో అవహేళనతో ముంచెత్తవచ్చినట్లు భావించాను. కాదు పొరపడ్డా !. సుందరివి ! కాదు జగత్ సుందరివి !! కాదు అజంతా సజీవసుందరివి !!! నా హృదయంలో

నవవసంత గీతాలు ఆలాపించి మోడువారిన కొమ్మలకు చిగురింతలు వెలార్చిన వీణవి, కోకిలవి ! సుందరీ ఒక్కసారి ఇటుచూడు !

* * * *

సుందరి : (*నవ్వు*)

* * * *

రావు : నవ్వకు – నా అంచనాలు తప్పాయని – నిన్ను గుర్తించలేక పోయాననీ నన్నుచూసి నవ్వకు ! ఏదీ.... ఒక్కసారి ఇలా రా ! (*ముందుకు అడుగు వేసినసూచన*) ఆహా! నీ బుగ్గలతీరు, నీ నడుం ఒంపు, నీ వ్రేళ్ళ సొగసు- నీ కంటిలో – ఒంటికో – ఎంత మృదుత్వం – మధురత్వం – తొణికిసలాడు తూంది. తెలుగు అన్నలు చెక్కిన అజంతా సుందరివిలా కనబడుతున్నావు!

* * * *

సుందరి : (*ఒయ్యారంగా*) ఓహో ! అజంతా సుందరినన్నమాట ! నీ అన్నలు చెక్కిన సుందరవిగ్రహ సౌందర్యరాశిలో, కుప్పగాపోసిన భావాలరాశి, శిల్పచాతురి, స్వర్గచరిత్ర, అంతా నన్ను చూస్తుంటే నీకు గుర్తుకు వస్తుం దన్నమాట ! బాగుంది ! సంతోషం! ముందరనన్ను అనుమానించి, అవమా నించి, ఆక్రోశంతో, ఆవేశంతో, అదిరించి, బెదరించి, నిలదీసి, ప్రశ్నపరంపరల, సుడిగాలితుంపరలతో తడిపి ముంచెత్తావు. వెర్రివాడా ! నేను ఎవరినో యిప్పటికైనా తెలుసుకో. రా ! లేచి రా ! !

రావు : సుందరీ ! నీ అందానికి నా జోహార్లు ! నీమాటలు విదజల్లే మధుర తుంప రలకు నా జోహార్లు ! సుందరీ ! నువ్వు ఎవరో అని ఒక రాయిలా, గొంట్లు గొంట్లుగా కనుపిస్తే అనుమానంతో ప్రశ్నించా. అవమానానికి సోపానంవేసి అవహేళనకు గోతులు త్రవ్వుకున్నా. సుందరీ ! ఇదిగో ఇదే వస్తున్నా !

* * * *

సుందరి : రా ! నా వెనుకనే రా ! దారి తప్పకు ! నా అందానికి హారతులెత్త కర్పూరం మరువకుండా పట్టుకురా ! నా ప్రతిరూపాల్ని చిత్రించ కుంచలు మరువకుండా తెచ్చుకో ! నా చరిత్రను విశ్వానికి వినిపించ కలాలు మరచి పోయి- నాలుక కరవక- ముందే మేలుకో ! నేను రాయిననీ, నేను శిథిల మయిన రాతి సముదాయపు గుట్టననీ, నా ముక్కులు, చెక్కిళ్ళు గొంట్లుగా వున్నాయనీ, తప్పు అంచనాలు వేసుకు- నీ గతచరిత్రకు, నీకోసం- రేపటి కోసం, నిన్ననే చరిత్రలల్లిన శిల్పుల చాతుర్యానికి అగౌరవం రానీయకు !

నీ అన్నలు పట్టిన కుంచలు, నీ అన్నలు పట్టిన శానాలు, ఎటువంటివో, నీ అన్నలు చెక్కి వెళ్ళిన ఆ స్థూపారామాలు- ఎన్ని నాగరికతలకీ, ఎంత ఔదార్యానికీ, ఎన్ని ధర్మోపదేశాలకీ, ఎన్ని సత్య ప్రబోధాలకీ నిలయమో గ్రహించు. రా ! బయలుదేరు ! !

*     *     *     *

రావు : *(గట్టిగా)* హా ! సుందరీ....! నీవు నిజంగా దేవతామూర్తివి. నీ అందం నన్ను సుగంధంలో ముంచెత్తుతూంది! నీ మాటలు నన్ను మత్తకోకిల గాన రాగ దోలికలలో ఉయ్యాల లూపుతూంది. సుందరీ ! ఏదీ ఒక్కసారి. నీచేయి నాచేయితో కలుపు. నీ చూపులు నాచూపులకు ఒక్కసారి అందియ్యి. సుందరీ! నువ్వు నిజంగా అజంతా సుందరివే. ఆహా ! నీ చేతులు ఎంతమెత్తగా దూదిరేకులుగా వున్నాయి ! నీ నీలాల కళ్లు మిలమిలా మెరసి మురిపిస్తున్నాయి సుందరీ ! నువ్వు ధరించిన ఆ దుస్తులు ఏనేత నేశాదో కదా ! నీ పెదిమలు, ముక్కు, కోటిజన్మలకైనా మరువలేని వేలుముద్రలాంటి జ్ఞాపక చిహ్నాలు ! ! నీతో యుగాలు, తరాలు, తీరాలంట- చీకట్లో నడవమన్నా- గడపమన్నా చాలు. సుందరీ ! నీ అందం ముందర నీకు నువ్వే సాటి. నేను కోరుకో గలిగింది ఏమీ లేదు.

*     *     *     *

సుందరి : ఎంతదూర మొచ్చామో తెలుసునా ?

*     *     *     *

రావు : ఎంతదూరమైనా అవసరం లేదు- ఈ సుందరయాత్ర- నాకు అందమైన సునాయాస సల్లాపయాత్ర ! తీసుకువెళ్లు. ఇంకా నీ పవిత్ర అందాల రాశి వద్దకు. అదే నాకోరిక. *(ఆశ్చర్యం - హడావిడి)* ఇవన్నీ ఏమిటి ? అజంతా ఎల్లోరా స్థూపారామాలు కదూ? ఇక్కడి కెందుకు తీసుకువస్తి ! వీటిలోనేనా నా సుందరి నివాసం !

*     *     *     *

సుందరి : ఇవన్నీ నీ అన్నలు శ్రమించి, రోజులు తరబడి శ్రమించి స్వర్ణ చరితను సృష్టించిన స్థూపారామాలు. చూడు ! తనివితీరా చూడు ! తిరిగి తిరిగి పరికించి పలకరించి చూడు ! నీ అన్నలు చెక్కిన ప్రతిరాతికీ, ప్రతిబొమ్మకీ, ప్రతి ఆకారానికీ, జీవం పోశారు. చరిత్ర సృష్టించారు. నీతో యింతదాకా పలకరించి, అనుకరించిన ఈ సుందరి ఈ గుహలోపలి విగ్రహసుందరే

తెలిసిందా ? ప్రపంచానికే సవాలుపలుక కళను సృష్టించారు- ఈ స్థూపసము దాయంలో. రా : లోనికిరా : ఈ విగ్రహాలు, చెక్కుళ్ళు చూడు. కూర్చో : చాలాదూరం శ్రమపడి పరుగులతో, ఆనందంతో వచ్చావు. విశ్రాంతి తీసుకో :

*  *  *  *

రావు : *(గట్టిగా)* సుందరీ....! ఒక్కసారి ! ఒక్కక్షణం ! నా చెంతను కూర్చో! చాలు సుందరీ : ఏమి అందం : ఏమి శిల్పాకారం : ఏమి సొబగు : సుందరీ....! ! !

*  *  *  *

రావు : *(బాధగా)* అబ్బా : ఎంత గట్టిగా తగిలిందీ....! ! రాధా ... ! రాధా ! !

*  *  *  *

రాధ : *(నిద్రమత్తులో)* ఏమిటండీ : తెల్లారింది. అలా తలుపును కావలించుకుని దెబ్బకొట్టుకున్నా రేమిటండీ....?

*  *  *  *

రావు : ఆఁ ! నే నెక్కడ వున్నానంటావూ ?

*  *  *  *

రాధ : ఇంట్లోనే :

రావు : *(ఆత్రుతగా)* ఇంట్లోనేనా ?

రాధ : ఆఁ ! ఇంట్లోనే ! మంచంమీదనుంచి గబాలున లేచి సుందరీ....అంటూ తలుపుకు కొట్టుకున్నారు !

*  *  *  *

రావు : *(ఆశ్చర్యం)* ఆఁ ! అది తలుపా ! ఎంతటి తియ్యని కల జరిగిందీ.... అవును : స్వప్నంలో కోటివెన్నెల రాత్రులు అనుభవించాను : సౌందర్యపు సీమలో ఉయ్యాల లూగాను. *(నిరుత్సాహంగా)* ఇంతాచేసి స్వప్నమా ? ఏమి సౌందర్యం - ఏం లాభం - స్వప్నంలో సౌందర్యం !



కావ్యప్రశస్తి :

# నాగార్జున సాగరం

— శ్రీ వల్లపురెడ్డి

ఈ రోజుల్లో కవిత *గేయరూపంగా అత్యధిక గౌరవాన్ని సంపాదించింది. అందుచేత ఈ యుగాన్ని సాహిత్యంలో గేయయుగంగా పరిగణించడంలో పొరపాటేమీ కాదు. అయితే అందరి గేయాలూ ఆదరణ పొందుతున్నాయా అంటే అది మృగ్యం. ఏకొందరి గేయాలో అభినందనీయంగానూ, రసానందాస్వాద యోగ్యంగానూ ఉంటున్నయి. తెలంగాణాలో మట్టుకు సి. నారాయణరెడ్డిగారు ఈ విషయంలో పతాకస్థాయి నందుకున్నారు. తెలంగాణాను మినహాయించి, తెలుగు మాట్లాడే మిగత ప్రాంతంలో—ఆంధ్రలో—గేయ కవులు, చెప్పుకోదగినవారు కొందరున్నప్పటికీ కొన్నికొన్ని నడకల్లో రెడ్డిగారి గేయకవిత వారికంటే ప్రశంసనీయంగా ఉంటూ వచ్చింది.

రెడ్డిగారి కవితలో శృంగారం ప్రధానంగా ఉంది, పఠితలని మరోలోకంలోకి తీసుకువెడుతుంది. అయినా వారి 'ఎర్రనై కళ్ళలోంచి' వెలువడిన చూపులు నిశితమై తూపులుగామారి నేడు మానవత్వపు బురఖాలో తిరుగుతున్న ముఠారాయుళ్ళను తీవ్రంగా బాధిస్తున్నయి.

కథా కల్పనలో రెడ్డిగారి సమర్థత మరపురానిది. వారీవరకు తొమ్మిది గేయనాటికలు వ్రాశారు. వాటిలో సుగాత్రి, గోకుల విహారం ఈ రెండూ మినహాయిస్తే మిగతావన్నీ కల్పితమైనను 'రాముడు' అనే నాటికలో కేవలం ప్రయోజనం ఉంది. రసంలేదు. 'జలపాతం' వారి కావ్యఖండికలకు చక్కని నిదర్శనం.

గీతికావ్యం 'విశ్వగీతి' తరువాత ఈ డిసెంబరులో ఆవిష్కరింపబడ్డ గేయకావ్యం 'నాగార్జునసాగరం' కవితారంగంలో రెడ్డిగారి వ్యక్తిత్వానికి వన్నెలు తెచ్చిపెట్టింది.

నాగార్జున సాగరం భారత ప్రభుత్వం సంకల్పించిన ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పూర్తికానున్న ఒక చెఱువు. నాగార్జునకొండ వద్ద కృష్ణానదికి ఆనకట్ట కట్టడం ద్వారా ఈ సాగరం ప్రజోపయోగకరంగా మారనుంది. దీనిపేరే రెడ్డిగారి కావ్యశీర్షికగా రూపొందింది. కావ్యంలో సాగరానికీ, కథకూ సన్నిహిత సంబంధం ఒక్క అంతిమ తరంగంలోతప్ప ఇంకెక్కడనులేదు. ఐనా, కావ్యానికి 'నాగార్జునసాగరం' అని పేరిడడంలో ఒక విశిష్టత ఉంది. మనకీ సాగరం ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ద్వారా లభ్యం కానుంది; కాని కథానాయిక స్వప్నంలో మొలకెత్తిన చిక్కని పాలకడలి కూడా ఇదే. కవిగారు దీనిని

అది నాగార్జున సాగర
మా ? ఏమో ! ఐన నౌను;
అది చిక్కని పాలకడలి
యా ? ఏమో ! చెప్పలేను

*గేయం నా దృష్టిలో మాత్రాగణబద్ధమై గానయోగ్యమైన కవిత. స్వేచ్ఛాఛందస్సులో వ్రాసిన గేయకవిత కాదు.

అని కొంచం అనుమానంగా విడిచిపెట్టారు. అయితే తరువాత నాలుగు పంక్తులు చదివే సరికి అది నాగార్జున సాగరమేనని ధృవ పడుతుంది.

పరువెత్తెడు కృష్ణానది
బంధించెను తన ఆత్మను
ఆమే ఆ మహా సాగ
రాకృతిని దాల్చి నిల్చినది.

ఈ గేయ చరణాలు అది నాగార్జునసాగరమే నని నిర్ణయించటానికిచాలు. సాగరంమీది తన ప్రియుణ్ని కలిసికోవడానికి శాంతిశ్రీ పరు వెత్తుతుంది.

కావ్యం ఐదు తరంగాలుగా రూపొందింది. నాలుగు తరంగాలు పూర్తిగా, ఐదో తరం గంలో సగానికిపైగా జరిగిన కథలా మిగతాది జరగనున్న కథలా తోస్తుంది మనకి. ఎందు కంటే నాగార్జున సాగర నిర్మాణం ఇంకా కాలేదు. కనుక, సాగర నిర్మాణానంతరం చదివిన వాళ్ళకి పూర్తిగా జరిగినట్లు పొడకట్టు తుంది.

కథ కేవలం కల్పితం. అయినా స్థలమూ, సమయమూ చారిత్రకం. శాతవాహనుల కాలంలో కృష్ణానదీ పరిసరాల్లో బౌద్ధమతం వ్రేళ్లు తన్నిననాటిది. అంతవరకేనాగార్జునుడు జీవించిన కాలం అంతరించి అతని పేరునకు చిహ్నంగా కొండలుమాత్రం నిలిచి ఉన్నయి. కృష్ణానదిని కవిగారు రమణీయంగావర్ణించారు. నేడు మనం 'నాగార్జునకొండ'గా వ్యవహరి స్తున్న పర్వతం ప్రప్రథమంలో శ్రీపర్వతం అని పిలువబడేది. ఆ 'శ్రీపర్వతుడు' తన పేరును మార్చుకోవడం గురించి కవి చిత్రంగా అన్నారు.

నాగార్జునుని పద
న్యాస మాత్రముచేత
శ్రీపర్వతుడు వెన్నె
లైపోయి విలసించె;
నాగార్జునుని బోధ
నా సుధాధునిలోన
శ్రీపర్వతుడు వెన్న
యైపోయి వికసించె.
.... ....
నాగార్జునుని పట్ల
ననరెత్తు భక్తి సం
భ్రమతలో తనపేరు
మరచె శ్రీపర్వతుడు;
మరచి శ్రీపర్వతుడు
మలచుకొనె తనుతాను
నాగార్జునుని పేర
నవ వైభవము మీర.

ఇదీ అసలు కారణమట. కావచ్చు మరి.

నాగార్జునుని కాలంనుంచే బౌద్ధమత బోధ సాగుతూ వచ్చింది. దూర ప్రాంతాలనుంచి విద్యార్థులూ - విద్యార్థినులూ వచ్చి బౌద్ధమత సూక్తికాభ్యాసంలో మనస్సుల్ని లగ్నం చేస్తూ వచ్చారు. నాగార్జునుని తరువాత బౌద్ధ మత బోధనకు ఆయన స్థానాన్ని ప్రవీణుడూ, మనోవాసనల బలి ఇవ్వగలిగినవాడూ ఆచార్య పదవిని స్వీకరించడం ధర్మం ఐంది. నాగార్జునాద్రిపై చైత్యములు నిర్మింపబడ్డాయి. చైత్యకుడ్యములపై బుద్ధమునీంద్రుని జాతక గాథలు సజీవంగా ఆకృతులతో నిలిచినయి. ఒకొక్క చిత్రం ఒకొక్క కళాఖండం. అయితే ఆ శిల్పకళాఖండాల్ని చెక్కి వాటిని రంగులతో రమణీయంగా తయారుచేయడా నికి కారకుడు ఒక శిల్పి. 'చైత్యస్థితి శిలా ఫలకజాలమ్ముపై నిదురించెడు కళాత్ములను ఉలితో మేల్కొల్పిన'వాడు.

'అతడు సామాన్య మనుజు;
డైన, అమరకళ కజుండు
అంద్రు డతడు; అంతియకా
దనంత విశ్వాత్మజుండు.'

అతనిపేరు పద్మదేవుడు. కళాత్మక జీవన మభ్యాసము చేశాడు. అతనికి జాతి, మత ప్రాంత విభేదాలు లేవు. ప్రబంధ నాయకునికి ఉండాల్సిన అవయవ సుందరత మాత్రమే గాక అతనిలో కళలు అనేకా లున్నయి. అతడు—

కఠిన శిలల నవనీతము
గా మార్చెడు తాంత్రికుండు
విషధరముల తలలూపెడు
రసవత్తర మాంత్రికుండు.

ఆ పద్మదేవుడు చైత్యకుడ్యముల మీద బుద్ధుని చరిత్రాన్ని అవతరింపజేశాడు. కవి అతడు చెక్కిన శిల్పాలను ఒక్కటొక్కటిగా అతి రమ్యంగా వర్ణించారు. శిల్ప చిత్రాల వివరము పఠితకు బుద్ధుని జీవితాన్ని సమగ్రంగా కళ్ళముందుకు తెస్తాయి. అంటే ఈ కావ్యంలో ప్రథమ తరంగంలో బుద్ధుని జీవిత గాథని మనం చదువ గలుగుతాం. శాక్యర్షి జీవితానికి సంబంధించిన పద్మదేవుని చిత్రాలను ఎనిమిదింటిని వర్ణించారు. వాటి ద్వారా బుద్ధుని జీవితమంతా అవగతమవు తుంది. ఐతే పద్మదేవుడు ఎనిమిదింటినే చెక్కాడా అనే సందేహానికి వీలు చిక్కుతుందనే ఊహ పొడమిందేమో, కడసారిగా

సలిలమొక కంట ప
చ్చని చిచ్చు వేరింట
విలసిల్లు బుద్ధమం
గళమూర్తి వర్తనలు
అతని జాతక గాథ;
లతడు సంసరణ సం
గత విముక్తిని పొంద
ననుభవించిన బాధ;
లన్నియాకృతులతో
అవతరించెను పద్మ
దేవుని కళా జగతియందు
అతడు చి
త్రించనిది కనిపింప దెందు.

అని ముగించి పద్మదేవుడు అసంఖ్యాకమైన శిల్పకళికలను మొలిపించినట్లు స్ఫురింప జేశారు. అతడు చెక్కిన శిల్పాల్ని సందర్శించ టానికి 'విదేశ రసజ్ఞ శేఖరులు' అనేకులు వచ్చారు. అతడు ఎల్లప్పుడూ కల్పనావస్థలో ఉంటూ తన సుత్తియను అనవరతమూ శైలకందరాల్లో ప్రయోగించాడు.

ఒకనాడు పద్మదేవుడు యశోధరా గౌతముల ప్రేమఘట్టాన్ని చిత్రముగా వేస్తుంటే ఒకామె వచ్చి అతని కల్లంతదూరాన నిల్చుంటుంది. ఆమె సౌందర్యం కవిగారి శైలిలో అవిరళంగా ప్రవహించింది.

కదలివచ్చిన మల్లి
కావల్లిక యనంగ
అవయవమ్ములు దాల్చి
నట్టి అమృతమనంగ
మదన సామ్రాడ్ధను
ర్మర్యాదలను దాట
వెనుక ముందాడు క్రొ
వ్విరి మార్గణ మనంగ
ఆమె రూపము పరిమ
ళాత్మక మ్మనిపించు
ఆమె నడచిన హంస
లనవసర మనిపించు.

పద్మదేవుడు తదేకదీక్షతో చిత్రరచనలో నిమగ్నుడై ఉండడంవల్ల ఆమె రాకను ప్రథమంలో గమనించడు; ఒక గాలి విసురువల్ల

త్రోయబడిన లతాగ్రాలు అతని దృష్టిని మరల్చుతాయి. ఇరువురూ పరస్పరం చూచుకుంటారు. అతని చేతిలోని కుంచియ జారిపోతుంది; ఆమె నేత్రాల జ్యోత్స్నిక లూరుతాయి.

ఎన్నో అజంతలు మ
రెన్నో అమరావతులు
వరుసగా వారిముం
దర వాలి తమ దివ్య
సౌందర్య నిధుల వెద
జల్లె నా సమయమున.

ఇరువురూ తమకు తెలియకుండానే ఏవో అనుభూతులు చెంది ఆశ్చర్యపడతారు. Love in the first sight అనే షేక్స్పియరు వాక్యానికి ఇదొక నిరూపణ. ఆమె చిత్రాన్ని చూస్తూ నిశ్చలంగా నిల్చుంటే అతడు మరో చిత్రాన్ని వేస్తూ "మీర లెవరో?" అని మెల్లగా ప్రశ్నిస్తాడు. ఆమె 'శాంతిశ్రీ' అని మాత్రమే సమాధానిస్తుంది. ఆమె పల్కిన ఆ ఒక్క మాటే అతనిలో ఏదో అవ్యక్తానుభూతిని రేకెత్తించగా ఆమె మాటల్ని తిరిగి ఆలకించే ఉత్సాహంతో సంభాషణ పెంచుతాడు.

"నాగార్జునుడు నిల్పి
నట్టి సన్నుత విశ్వ
విద్యాలయము లోన
విద్యార్థినిగ నేను
బౌద్ధ పాఠమ్ము ల
భ్యాసమ్ము జేతు" అని సమాధానం

చెబుతుంది. శాంతిశ్రీ మతాచార్యునికడ మత సూక్తికాభ్యాసానికై వచ్చిన వనిత. ఆమె అతని శిల్పకళా సందర్శనానికై పద్మదేవుడుండే స్థానానికి వచ్చింది.

ఆమె చెప్పినదాన్ని విని అతడు కొంచెంగా నవ్వి :

"మతపాఠములు దప్ప
ఇతరాంశములు మీకు
ఆస్వాదయోగ్యమ్ము
లైనట్లు కన్పడదు;
అయినచో నొకమాట
నడుగ ధైర్యము సేతు
రాతిబొమ్మలు మిమ్ము
రంజింప జేయు నెటు?"—

అని ప్రశ్నిస్తాడు.

ఒక్కొక్క వ్యక్తి కొక్కొక్క అభిరుచి ఉంటుంది. అయితే సౌందర్యమూ, సంగీతమూ ప్రతివాడినీ ముగ్ధుణ్ణి చేయగలుగుతాయి. పద్మదేవుని శిల్పకళా సౌందర్యం శాంతిశ్రీని వశపరచుకొన్నదనడంలో అనుమానం లేదు. ఈ ప్రశ్నలో కొంచం వ్యంగ్యం ఉంది. ఆమె జవాబులో కూడ ఒక ప్రత్యేకత నిండి ఉంది.

"ఏమహాత్ముని బోధ
యే మాకు వేదమో!
ఏమహాత్ముని ధ్యాన
మే మాకు ప్రాణమో!
ఆ మహాత్ముని బ్రతుకు
నంత త్వాదృశులు శి
ల్పకళా మనోజ్ఞ రూ
పముల చిత్రించినా;
రందుకే మాకు కళ
లాస్వాద యోగ్యములు
అందుకే మాకు కళ
లారాధనీయములు." —ఈ సమాధానంలో శాంతిశ్రీకి ఉన్న దృఢమైన మతసంరక్తి బయల్పడింది. పద్మదేవు డాశ్చర్యపడతాడు. సంధ్య అవరించగానే ఆమె వెళ్లిపోతుంది.

కావ్యంలో కథ జరగటానికి పట్టిన కాలం రెణ్ణెల్లోపు. శాంతిశ్రీ పద్మదేవుని గళాఖండాలను దర్శించి వచ్చిన మరురోజునే చైత్రలక్ష్మి లోకంలో అడుగెట్టింది. వైశాఖ శుద్ధ పూర్ణిమతో కథ ఆఖరు. ఆనాడు బుద్ధదేవుని జయంత్యుత్సవం.

ద్వితీయ తరంగం శాంతిశ్రీ పద్మదేవుని చిత్రాల్ని చూచివచ్చిన మరురోజు ఉదయమవడంతో ప్రారంభమౌతుంది. ప్రాభాత వర్ణనంలో శ్రీ రెడ్డిగారు ప్రబంధాలలోని వర్ణనలకంటే నవత్వాన్ని యిమిడ్చారు.

ఒక మహాత్ముని మాన
సిక నిగ్రహణ శక్తి
కెదురొడ్డి పోరు లా
కిక కామనల వోలె
రాత్రి సొంతము గుప్త
రశ్మితో పోరాడి
చీకటులు పర్వు దీ
సెను దిగంతాలబడి

ప్రభాతం అయింది. ఇక సూర్యోదయం—

ఒక మహాజ్ఞాని మౌ
ళిక వికాసము జూపు
వేళ రేకులు విప్పు
విమల భావన భంగి
ప్రాచీ దిగంగనా
ఫాల రంగముపైన
కుసుమించె స్వచ్ఛ కుం
కుమ కాంతి గుచ్ఛమ్ము.

అభ్యుదయములో వసంతలక్ష్మి లోకంలో అడుగెడుతుంది. 'ఆ వసంత ప్రభాతామూల్య సంధ్యలో' శాంతిశ్రీ మేల్కాంచి, కృష్ణలో స్నానమాడి, మల్లికాసిత నవాంబర ధారణముచేసి, 'పెన్నెఱిగుంపు సన్నగా విడదీసి, తడియార్చి కటిపైన బడునట్లు విరబోసి'—

'బాలభాస్కరుని కెం
గేలి తాకిడుల నో
పక కిలకిలానవ్వు
వికచాబ్జములదూసి
పద్మదేవుని కళా
సద్మాభి వదనయై'—నడిచింది మనః ప్రసన్నతతో.

'భానుదేవుని మొదటి
బంగారు కిరణమ్ము
పడతి రూపును దాల్చి
నడువ నేర్చెననంగ
ఆమె అత్యంత శో
భాదీప్తయై నడిచె
ఆమె పద్మాహ్వయుని
ఆలయమ్మును దరిసె.' — ఆమె అందాని కిది కొలబద్ద.

ఆ సమయంలో పద్మదేవుడు అంతిమ కళామందిరంలో రాతి సెజ్జపై నిద్రావస్థయందుంటాడు. అతనిచేతిలో తూలిక కలగాంచు తుంటుంది. గతరాత్రి అతడు మేల్కొని ఉండటం మూలాన అంత ప్రొద్దెక్కినా నిదురనుండి లేవలేదు. అతడు స్వప్నంలో శాంతిశ్రీని చూస్తుంటాడు. తను గడచిన రాత్రంతా మేల్కొని వేసిన చిత్రము గూడా శాంతిశ్రీదే. శాంతిశ్రీ భిత్తికపై నిలుచున్న చిత్తరువును చూసిఆశ్చర్యమనస్కయై పోతుంది. అప్పుడే పద్మదేవుడు మేల్కాంచి స్వప్నంలో తను చూస్తున్న శాంతిశ్రీని ఎదుట చూసి విస్మితుడౌతాడు. సిగ్గుపడి, దిగ్గున లేచి "ఆహా ! శాంతిశ్రీ ! మీరలా ?" అని అంటాడు. ఆమె

"మేమా శాంతిశ్రీలము
మీరలెంత వింత వారు ?

అదుగో శాంతిశ్రీ కు
డ్యమున నిల్చినారు మీరు." — అని
జవాబిస్తూ,

"శాంతిశ్రీ కూడ బౌద్ధ
జాతక కథలకు చెందిన
కాంతయె ? దయతో మీరీ
వింత నాకెరింగించుడు." అని
వ్యంగ్యంగా ప్రశ్నిస్తుంది.

ఆమె మాటల కతడించుక చలిస్తాడు.
ఐనా—

"సజీవముగ కన్పించెడు
శాంతిశ్రీ ఎదుట నుండ
జాతక గాథల లోపలి
జలజాక్షుల వెదకనేల ?
చిత్రగతమ్మగు శాంతి
శ్రీతో మాట్లాడు చుంటి
జీవ శిల్పమగు శాంతి
శ్రీ నిప్పుడు ఎదుట గంటి
ఇది చిత్రము గాదా ?—" అని
అంటూంటే

"పూజనీయుడైన బుద్ధ
మునీంద్రు జాతకగాథలు
చిరస్మరణ యోగ్యములుగ
జేయుట మీ కర్తవ్యము
... .... ....
నన్నుబోలు క్షుద్రజీవ
న భాజనులను చిత్రించి
శిల్పకళకు మచ్చ కల్గ
జేసినారు మీర లయో!"—అని బాధ
పడుతుంది.

నిజానికి కళ అనేది ప్రత్యేకంగా ఒకరి
కొఱకు అని ప్రత్యేకింపబడలేదు. అది ఒక
జాతికొఱకు గాని, ఒక మతం కొఱకుగాని,
ఒక పార్టీ కొఱకు గాని, వినియోగించాలనే
నియమం అర్థరహితమైంది. కళకు హద్దుల్ని
గీయడం భగవంతునికి ద్రోహం చేసినట్లు,
కళ అనంతం. అందుకే పద్మదేవుడు శాంతిశ్రీ
బేలతనానికి జాలిపడుతూ గంభీరంగా—

"అయ్యయ్యో ! మీరలెంత
అమాయికలుగా నుంటిరి ?
మతము దప్ప వేరే జీ
విత పథమ్ము లేదంటిరి.
మతమే ప్రతి వానికి జీ
విత సర్వస్వమ్ముగాదు
మత బంధ మ్కింత లేని
మహామహులు లేరెందరు ?
మత బోధలకే కళ లం
కితము సేయు టెందులకో ?
సౌందర్యమునకు మతమున
స్థానము లేదెందులకో ?
నేను బౌద్ధమత యాయిని
కా; నైనను నాదు కళా
జీవితమ్ము బుద్ధమూర్తి
చిత్రణకే అంకితమ్ము—"

కళా జీవితమంతా బుద్ధుని చిత్రణకు
అంకిత మొనరిస్తే అతడు బుద్ధుణ్ణి అనుస
రించినట్లే! అయితే బౌద్ధమతస్థుడు కావ
డంలో భేదమేముంటుంది ? అందుకే శాంతిశ్రీ
"మీరు నిశ్చయంగా బౌద్ధులే! సందియ
మేమిటి ?" అని అర్థోక్తిలో అందుకుంటుంది.
పద్మదేవునికి ఆమె తీర్మానం నచ్చక

నేను బౌద్ధుడనని మీరు
నిర్విచారముగ నంటిరి.
కాని మతాచార్యుల దృ
క్కోణమ్ములు భిన్నమ్ములు.
నేను ముండిత శిరస్కుడ
గాను ; కాను కాషాయాం
బరధారిని ; కాలేను త్రి

శరణమ్ములు వల్లించెడు
సన్యస్తాఖిల భోగిని;
కాన నేను బౌద్ధుండను
గాను సుమీ ! ఆచార్యులు
నన్ను కళా స్రష్టగనే
మన్నన సేయుచు నుందురు.
కరుణామయుడగు బుద్ధుని
గాథలన్ని మా దృష్టికి
కళా ఖండముల రూప
మ్ములలో కన్పించుచుండు.
ప్రకృతిలోని ప్రత్యణువున
పరమాద్భుత శోభాన్విత
సౌందర్యము నిర్లిప్త
స్థాయిలోన నిదురించును.
నిద్రిత సౌందర్యము ను
న్మిషిత మొనర్చును సు_త్తియ ;
నిగూఢ సుందరతను వ
ర్ణితమ్మొనర్చును కుంచియ;
సౌందర్యమె మాదు కళా
మందిర మూల స్తంభము;
సౌందర్యాన్వేషణలో
స్వప్నమధుర పరిరంభము
హృదయ కంపనలలోనే
ఉదయించును చిత్రమ్ములు
మధుర కల్పనలలోనే
మలచబడును శిల్పమ్ములు.

.... .... ....

ఈ విధంగా కళకు సంబంధించిన సత్యాల నన్నిటినీ ఉపన్యసిస్తాడు. శాంతిశ్రీ అనిమేష అవుతుంది. సమయ మెంత గడచినదీ తెలియదు. పద్మదేవుడు తన్నుతాను మరచిపోయి స్వప్నానుభూతిలో పడిపోతాడు.

జగద్భాండ మొక్క మహా
స్వర్గధామమైన యట్లు
శాంతిశ్రీ అప్సరో వి
శాలనేత్ర యైనయట్లు
తానొక గంధర్వుడుగా
తాదాత్మ్యము జెందినట్లు—

ఊహించుకుంటాడు. శాంతిశ్రీ తన ధ్యాస నుండి జాగరణం పొంది సిగ్గిలుతుంది. ఏమీ తోచక "గృహద్వారమేది ?" అని ప్రశ్నిస్తే పద్మదేవుడుగూడా యథా ప్రపంచంలో పడి "ఏమిటేమి" టని అడిగితే ఆమె ఏమీలేదని జవాబు చెబుతుంది. ఈ ఘట్టం సహజంగా ఉండి పాఠకునికి నవ్వు కలిగించటానికిచాలు. ఇలా ఒకరి ప్రశ్నను ఒకరు తెలిసికోకుండా సమాధానాలు జరగడంతోనే

ఆమె గుండె లోన వీణి
యలు కదలిన యట్లు తోచె
అతని మనసులోన మల్లి
యలు నవ్విన యట్లు తోచె

.... .... ....

ఇర్వురిలో కదలసాగె
నేదో అవ్యక్త బాధ.
ఆ బాధకు పేరులేదు
ఆ బాధకు నోరులేదు
ఆ బాధకు మించిన తి
య్యని బాధయె వేరులేదు.

గత రాత్రమున తాను చిత్రించిన శాంతిశ్రీ చిత్ర ఫలకాన్ని ఆమె కర్పిస్తాడు పద్ముడు. ఆమె మనస్సులో స్వీకరించే సంకల్పం లేదు. ఆమెకు మతమే సర్వస్వం. అయినా స్వీకరించక తప్పలేదు. హృదయాని కద్దుకొంది. ఇంతటితో రెండో తరంగం పడిపోతుంది. మూడో తరంగం లేస్తుంది. అయితే రెండో తరంగం ముగింపులో కొంచం సందేహం కలుగుతుంది పాఠకులకు. ఒకటి రెండు మారులు చదివే వాళ్ళకు కావ్యరసానందాను

భూతిలో తేలిపోవడం మూలాన ఆ విషయం తోస్తుందో లేదో! శాంతిశ్రీ ఆ చిత్రాన్ని విద్యాలయానికి తీసుకు వెళ్లిందా? లేక స్వీకరించి అక్కడే వదలిపోయిందా? విద్యాలయానికి తీసుకు వెళ్ళడానికి సుతరామూ వీల్లేదు. బుద్ధుని చిత్రాలు తప్పితే మరేమి ఉంటానికి వీల్లేదక్కడ. అందులోనూ పద్మదేవుడు రచించిన శాంతిశ్రీ చిత్రఫలకంఅసలే ఉంటానికి వలను పడదు. పైపెచ్చు అది పద్మదామెకు కానుకగా అర్పించిన దాయె! గురుదేవుడది సహించడు. పద్మనిపట్ల తనకు కలిగిన అభిమానానికి చిహ్నంగా ఆమె స్వీకరించింది. అయితే ఎక్కడుంచింది? ఈ సందేహ నిష్పత్తి రెడ్డిగారు కావించలేకపోయారు. కాని మనం అది అంతగా లెక్కించదగ్గదీ కాదు. గంగా ప్రవాహంలా గంభీరంగా ప్రవహించిన రెడ్డిగారి కవితా మాధుర్యంలో అది కన్పించనే కన్పించదు. ఆమె చిత్రాన్ని స్వీకరించి అక్కడే వదలి వెళ్లిందనుకుందాం.

సంఘ మర్యాదలనుదాటి ప్రవర్తించే వాళ్ళకు ఇక్కట్లు తప్పవు. వాళ్ళ ప్రవర్తనలో ఎంతటి మహోన్నతాదర్శమున్నా సరే, తప్పకుండా సంఘం వాళ్ళని ఇబ్బందుల్లోకి నెట్టుతుంది. వాటిని సహించి ఎదుర్కొనే వాళ్ళు ఒక లక్ష్యాన్ని సాధించి తరువాతి వారికి మార్గదర్శకులవుతారు. కాని సంఘం కల్పించిన నిర్బంధాలకి తలవొగ్గి నశించిపోయేవారికి ప్రత్యేకత అంటూ ఒకటి సిలవదు.

శాంతిశ్రీ పద్మదేవుల మధ్య జనించిన ప్రేమ ప్రవాహానికి అడ్డంకులు తృతీయ తరంగంలో తలెత్తుతాయి. ఒకనాడు గురుదేవుడు మతసూక్తులని బోధిస్తూ ఉంటాడు. ముందుశ్రేణిని ఉన్న విద్యార్థినులలో శాంతిశ్రీ ఉంటుంది. ఇప్పటి పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ స్త్రీలకి ముందు వరుసలు ప్రత్యేకించడంలో ఆనాటి ఆచారమే అమలు జరుపబడుతుందేమో! గురుదేవుడు బోధనకు పూనుకున్న సమయం మొదట తెలియదు. కాని తరంగం పూర్తి కావడానికి ఒక పేజి ముందు

ఆ యమూల్య మధురానుభూతిలో
ఆ యపూర్వ రాగార్ద్రి గీతిలో
ఆ యలౌకిక మహానురాగ చాం
ద్రీ నిగూఢ రేఖానిశీధినిన్
ఎన్ని గడియలు గతించి పోయెనో!
ఎంత వెన్నెల ద్రవించిపోయెనో:—

అని వ్రాయడం మూలాన సూర్యాస్తమయ సమయంలో బోధనారంభం జరిగిందనవచ్చు. ఆచార్యుని బోధనల్లో బౌద్ధమత సూక్తులన్నీ వివరింపబడినవి, వాటిని చదువుతున్నంతసేపూ పాఠకుడు తనూ ఒక బౌద్ధమతాభిలాషిగా భావించకుండా ఉండలేడు. కవి కల్పించిన ఆచార్యుడు తనకు బోధిస్తున్నట్లుంటుంది. ఈతరంగమంతా నారాయణరెడ్డిగారి అపూర్వ శైలికి మచ్చుతునక.

మతాచార్యుడు బోధిస్తుండగా వేణుగానం వినవస్తుంది. ఆ గానం తనంతటతానే కృష్ణవేణీ తీరమున లేచి శాంతిశ్రీని వెదుకుతూ వచ్చినట్లుగా వర్ణించడంవల్ల గానానికి జీవం వచ్చింది. ఆ మురళీరవం శాంతిశ్రీని కలవర పెట్టింది. కావ్యంలోని రామణీయకతను వివరించడానికి ఈ ప్రకరణాన్ని పూర్తిగా ఉదహరించాలి. కాని వ్యాసం దీర్ఘమవుతుందనే శంకచేత సూక్ష్మీకరించాల్సి వస్తుంది.

ఒకపైపు గురుదేవు
డుత్తుంగ గంగా త
రంగ సదృశ గళ స్వ

రమ్మె త్తి ప్రవచింప
ఒకవైపు యామునో
ర్మిక రీతి వీతెంచు
వేణుగానము హృదయ
వీథి నుప్పొంగింప

ఎటూ తోచక శాంతిశ్రీ విలోల మానస అవుతుంది. గంగానది గాంభీర్యతకూ, యమున శృంగారానికీ నిలయాలు. గురుదేవుని వచనాల్లో గంభీరత, వేణుగీతిలో శృంగారమూ ఉన్నాయి. శివ జటాజూటము నుంచి పడ్డం మూలాన గంగను గంభీరతకు, కృష్ణుని రాసక్రీడలకు తావు కావడంవల్ల యమున ప్రణయ శృంగారానికీ ఉపమానాలుగా తీసుకోవడంలో సహజత్వం కుప్పగా ఉంది. ప్రణయం శాంతిశ్రీని గెలిచి తీసుకుపోయింది. ఆమె గురుదేవుని ముందునుంచి అప్రయత్నంగా లేచి వెడుతుంది. గురుదేవుడు చూస్తాడు. అతనిముఖం క్రోధంతో కందగడ్డగా మారిపోతుంది.

ఆచార్యుని భ్రుకుటి నిటా
లాంచల మారోహించెను
ఆమె మనసు నదీ తీర
మందక సంచలియించెను

ఆ సమయంలో శాంతిశ్రీ నడకను గూర్చి

ఆమె చలించెను ఆమనిపోలిక
ఆమె చలించెను అబ్దము పోలిక
ఆమె చలించెను అతిశీత సమీ
రాహృత నదీతరంగము పోలిక
ఆమె వికచ నయనాంబుజ సీమల
లో మెటిసెను సుకళామృత రూపము
ఆమె విమల కర్ణాంతర వీథుల
లో మొఱసెను వంశీమృదు రావము

అని వర్ణించినచోట కవితాశైలి మరుపునకు రానిది.

శాంతిశ్రీ వేణు గీతాహృతయై కృష్ణానదీ తీరం చేరుతుంది. అచ్చట పద్మదేవుడు నిమీలిత నేత్రుడై గీతాలు వాయిస్తుంటాడు మురళీ మీద. (సమయం సాయంత్రం అని నిరూపించడానికి పద్మదేవుడు చేసిన కాంభోజి రాగాలాపనం ఇంకా బాగా సాయపడుతుంది.) శాంతిశ్రీ తన్మయత్వంలో పద్మదేవుడు మురళీ మీద మారుస్తున్న స్వరాలకి తగినట్లుగా అభినయిస్తుంది.

అతడామె ఆమె అత
డైపోయి నటులాయె
ఇరువురికి నడుమగల
తెరలు మాయమ్మాయె.

ప్రేమకి తరువాతి అంకం శారీరక సౌఖ్యం అయితే కావచ్చు. కాని శాంతిశ్రీ పద్మదేవుల పట్ల అది చివరిదాకా మానసికమే ఐంది. దీన్నే

"సంయోగమే లేని
సౌందర్యమే మిన్న"

అని 'అజంతా సుందరి'లో నిర్వచించారు. కొందరు దీన్ని ఒప్పుకోరు. సంయోగ వాంఛ లేని సౌందర్యం ఉండటం కల్ల అనే విమర్శలు రేగినై. అవి సమంజసంగాలేవు. ప్రేమలోనూ ఉత్తమ, మధ్యమ అధమాలను వేరు చేయవచ్చు. సంయోగవాంఛలేని సౌందర్యాస్వాదనం ఉత్తమం. ప్రేమకి తరువాతి అంకం శారీరక సౌఖ్యం అయితే అది మధ్యమం. ఇక కేవలం శారీరక సౌఖ్యం అయితే అధమం. దీన్నిబట్టి రెడ్డిగారు నిర్వచించిన నిర్లిప్త సౌందర్యాన్ని త్రోసి రాజనలేం.

'అతడామె ఆమె అతడైపోయి నటులాయె' అనడంలోనే కావలసిన సంగతంతా ఇమిడిపోయింది. కాని కవిగారు

అతడు చంద్రుండాయె
ఆమె చంద్రిక యయ్యె
అతడు తంత్రిక యయ్యె
ఆమె మూర్ఛన యయ్యె
అతడు గాయకు డయ్యె
ఆమె పల్లవియయ్యె
అతడు కృష్ణుం డాయె
ఆమె వల్లవి యయ్యె.
అతడు వాదకుడయ్యె
ఆమె వల్లకి యయ్యె
అతడు శైబికుడయ్యె
ఆమె పల్లకి యయ్యె
అతడు నేత్రంబాయె
ఆమె పక్ష్మంబాయె
అతడు గాత్రంబాయె
ఆమె పక్షంబాయె
అతడు ఉదయమ్మాయె
ఆమె తేజమ్మాయె
అతడు హృదయమ్మాయె
ఆమె భావమ్మాయె

అని పొడిగించారు. ఇందువల్ల జరిగిన రస లోపమేమీ లేదు. పైపెచ్చు చదివేవాళ్ళకు అతీతమైన ఆనందం కలుగుతుంది. ఈగేయ పాదాల్లో రెడ్డిగారికి స్వతఃఅబ్బిన శబ్దచాతుర్యం విశదమవుతూంది. ప్రాసాంత్య స్వరసమ్మేళ నంలో ఈకవి తనకు తనే సాటి. కావ్యమంతా ఈ విషయం మనోరంజకంగా ఉంది.

శాంతిశ్రీ తనకు తెలియకుండానే పద్మ దేవుని అంకంలో పడిపోతుంది. పద్మదేవుడూ ఆవిషయాన్ని గమనించడు. చివరికి వారి పూర్వ స్మృతులు వీచే సరికి ఇరువురూ విస్మయాకులిత మనస్కులవుతారు. వారి పవిత్ర ప్రవర్తనను కృష్ణవేణి మసకలేని స్ఫటిక దృష్టితో చూస్తుంది.

అతడు లజ్జాభర
మ్మతిశయించగ నడిచె
ఆమె భయ సంత్రస్త
యగుచు అతని విడిచె.
అతడు నిట్టూర్చి స్వక
ళాలయమ్మున కేగె.
ఆమె చెమటోడ్చి సం
ఘారామమున కేగె.

అంతటితో చతుర్థ తరంగం వచ్చి తృతీ యాన్ని కప్పుతుంది.

శాంతిశ్రీ మారిపోయింది. ఇప్పుడామె పూర్వపు శాంతిశ్రీకాదు. ఆమె హృద యంలో పద్మని పట్ల రాగం, ధమ్మిల్లంలో దినమొక రంగుపువ్వులు, మత సూక్తులకు బదులుగా సౌందర్య సూత్రాలు అభ్యసించ సాగింది. విద్యాలయం మనస్సుకు కలత కలిగిస్తే అది కళాలయంలో ఆనందంగా మారుతుంది. ఐనా, శాంతిశ్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యంలేదు. గురుదేవుణ్ణి ధిక్కరిం చనూ లేదు, పద్మదేవుణ్ణి మరువనూలేదు.

అది మధుమాసం. ఒకనాడామె తన నర్మ సఖియైన సుజాతతో

సంఫుల్ల కుసుమాప
చయ నిమిత్తమ్ము కృ
ష్ణానదీ పరిసరో
ద్యాన సీమలకేగె.

ఆమె తనకు పువులంటే మనసు లేదని వచిస్తుంది. కాని కొంచంముందు కరిగినంతనే అత్యంత మనోహరమైన ఒక పద్మవనం ఎదురుగా వచ్చి నిలుస్తుంది.

పద్మ సందర్శన
ప్రథమ క్షణములోన
ఆమె చూపులు తేటు
లై ఝమ్మనుచు లేచె.

వెంటనే మోకాటిలోతు నీటిలోదూరి తన మనసు మోయజాలిన—తనువు మోయగ లేని—పద్మాల్ని కోసి వణకుతున్న కొనుతో సఖిని చేరుతుంది. సుజాత ఆశ్చర్యపడి పద్మాలకీ ఆమె ప్రవర్తనకీ ఉన్న సామ్యాన్ని ఇలా అంటుంది.

"తోటలోపలి పుష్ప
కోటి నేనొల్లనని
నీటిలోపలి పద్మ
వాటి కేతెంచితివి;
ఏమిచెలి నీవింతగా
మారిపోయితివి ?
పద్మమ్ముపై పంచ
ప్రాణాలు నిల్పితివి ?"

ఈ మాటలు వింటూనే శాంతిశ్రీ భయపడుతుంది. సుజాత నవ్వులాటకు అన్నదో భావగర్భితముగా పల్కిందో అనే సందేహం రాగా మౌనం వహిస్తే సుజాతయే తిరిగి అడుగుతుంది.

"ఎంత దేలవె నీవు ?
శాంతి ! పద్మ పదమ్ము
నుచ్చరింపగ వదన
మొందె వైవర్ణ్యము
నేనొంటిగా పల్క
గా నింత బెదరెదవు
సంఘమెదురై వచిం
చగ నెట్టు లోర్చెదవు ?"

శాంతిశ్రీ అనుమానం దూరమైంది. సంఘం తన్నుగూర్చి అనుకుంటున్నదన్న విషయం విని ఏం జరిగినదో వివరంగా చెప్పమని సుజాతని ప్రాధేయపడుతుంది. శాంతిశ్రీ పద్మదేవుల ప్రవర్తనని సంఘమెలా చూస్తూందో వివరిస్తూ

"నీవు పద్మప్రియుడు
నిండువెన్నెల రేల
కృష్ణవేణీ తటుల
క్రీడించు చుందురని
మన శత్రువైన మ
న్మథ పూజ సేతురని
గుసగుసలు—"

అని చెప్పేసరికి శాంతిశ్రీ సహించలేక పోయింది. సంఘం తనపైని పులిమిన అపనిందను తలంచుకొని సుజాతకుమారి ఉరములో శిరాన్నిదాచి విలపిస్తుంది. సుజాత కూడా కన్నీటితో ఆమె మూర్ధాన్ని అభిషేకించడంకంటే ఎక్కువ చేయలేకపోయింది.

ఆ స్థలానికి అప్పుడే పద్మదేవుడు వస్తాడు. అతనిరాక ఆమెకు బాధాకరమవుతుంది. సుజాత పద్ముడ్ని చూసి మెల్లగా నిష్క్రమించింది. శాంతిశ్రీ అతడి రాకను గమనించి తలవంచి ముందుకు సాగుతుంది. పద్మదేవుడు వెంబడించి కారణాన్ని పృచ్ఛిస్తాడు. ఆమె దుఃఖం అధికమవుతుంది. ఎట్లో కష్టపడి తమ 'విమల రాగమునకు సమాజము చేసిన వ్యాఖ్యా'నాన్ని చెబుతుంది. తను సంఘంలో తలెత్తుకుని తిరగలేనంటుంది. పద్మదేవునికి సంఘంపట్ల క్రోధం జనిస్తుంది.

"శాంతీ ! ఈ మాత్రమునకు
సాధ్వసమందంగ నేల ?
సంఘమునకు రెండు కనులు
సరిగా కన్పడవు బేల !
మన హృదయమ్ములు స్ఫటిక స
మానమ్ములుగా నుండగ
లోకులు పూసెడు పూతల
రో కారణమేమి మనకు ?
మతము దృష్టిలో స్నేహ
మ్మతి దూష్యమ్మైన గాని

మానవతను వెలిగించేడి
మహిత సాధన మ్మదియే
మానవతయె లోపించిన
మతమెందుకు శాంతి నీకు ?
మతవాసన యింతలేని
మహిత జీవితము గడుపుము."

పద్మదేవుని మాటలామెకు సమంజసంగా తోస్తాయి. కాని అప్పుడే

"నీవు సుఖమ్మనెడు ఎండ
మావి కొఱకు నఱ్ఱుసాచి
తిరిగితివా ? కడకు దుఃఖ
పరితప్తుడ వగుట నిజము
ఎల్ల జీవకోటులపై
చల్లుము ప్రేమామృతమ్మ
ప్రత్యేక ప్రాణిపైన
పనికిరాదు మమత్వము
విలాస జీవన తృష్ణలు
విసర్జ నీయములు సదా
చిత్తచలత నిర్వాణ
శ్రీ నాశనకారి గదా !"

అనే గురుదేవుని సూక్తులు గుండెలో జారుతాయి. మతంపట్ల ఆమెకు కలిగిన విరక్తి తిరిగి పూర్వరూపంతో ప్రత్యక్షం కాగానే "గురుదేవా ! గురుదేవా ! అపరాధమ్మని నిజ మృదుల కపోలాల వాయించుకుని త్రిశరణమ్ముల వల్లిస్తూ విద్యాలయాభిముఖయై పరువెత్తుతుంది. ఆమెలోన పొంగారు మతావేశమునకు పద్మదేవుడు మ్రాన్పడి చూస్తూ నిలబడిపోతాడు, ఇది చతుర్థం. పద్మదేవుడు శాంతిశ్రీని 'మీరు'గా సంబోధించి ఈ తరంగంలో 'నీవు'గా మార్చాడు. వారిమధ్య ఆత్మీయత అనే లంకె ఒకటి వచ్చింది.

మరుదినం వైశాఖ పూర్ణిమ. బుద్ధుని జయంతి. నాగార్జునాద్రిలోని తరువులూ, స్తంభాలూ, పద్మమాలాలంకృతములై వెలుగుతుంటాయి. అపర సంధ్య అయినాక గురువు ఎత్తైన పీఠమున కూర్చుంటారు. ముందుగా శిష్యకోటి ఉపవిష్టులౌతారు. శాంతిశ్రీ గతదినపు ఘట్టాన్ని తలంచుని బాధపడుతూ వ్రేలాడుతున్న ప్రతిపద్మంలోనూ ఒక్కొక్క పద్మదేవుణ్ణి ఊహించుకుంటున్న వేళలో

"నేడు మహా త్యాగి బుద్ధు
ని జయంతి మహోత్సవమ్ము;
నేడే మీ ఆత్మల ను
న్మేషమ్మొనరించు దినమ్ము
గతమున మీ మనోదర్ప
ణ తలమ్ముల నంటుకొన్న
మషీరసము కడిగివేయ
మంచి సమయ మీనాడే.
మీలోపల నెవ్వరైన
కాలుజారి అడుసులోన
దిగినచో వచించు డిట్టి
దినమున దీక్షగైకొనుడు.
అతః శౌశనముకన్న
అమల సాధనమ్ము లేదు!
పాపగోపనమున కన్న
పరమ నైచ్యమేదిగాదు."

అని ఉరుముతాడు. పద్మదేవుని ఆకారము ఆమె దృష్టిలోంచి చెరిగిపోతుంది. సంఘం తన్ను పతితగా భావిస్తుందని తోచేసరికి లేచి తనవైపే తీక్షణముగా చూస్తున్న గురుదేవుని పాదములపై వ్రాలి పరిపూర్ణ మతదీక్షబడయ తలచినట్లు చెప్పి

"గురుదేవ ! గురుదేవ !
గురుదేవ ! నాపైన
కరుణామృతము జల్లి
కాపాడుమయ్యా.'

అని వేడుకుంటుంది. ఇచట శాంతిశ్రీ మత దీక్ష తీసుకుంటుంది. అట పద్మనిలో హాలాహలం రగుల్తుంది. శాంతిశ్రీ తనకు శాశ్వతంగా దూరమై పోతుందని శంక కల్గుతుంది. శాంతిశ్రీ లేనిచే తన శిల్పాలన్నీ 'మొండి రాతిల' వలె కన్పిస్తాయి. హృదయంలో ఆందోళనతో బోధనా మందిరం వైపు వచ్చి ద్వారం ముందు నిల్చున్న భిక్షువులతో శాంతిశ్రీని ఒకసారి రమ్మనమంటాడు. వాళ్ళీస డించు కుండారు. పద్మదేవుని వాదననువిని గురుదేవుడే స్వయంగా అక్కడికి వస్తాడు. "శాంతిశ్రీ నిన్ను జన్మలో చూడనంచు దీక్ష పూనింది. నువ్వు ఏముఖంతో ఆమెను చూట్టానికి మళ్ళీ వచ్చావు?" అని నిందించగానే పద్మదేవుడు ఆయనమాటకు బాధపడి, కోపంతో

"ఆచార్యా! మీమాటల
అంతర్యము గమనించితి
మీరలామె కొనరించిన
మేలు గూడ నూహించితి
మతమనియెడు పచ్చిమచ్చు
మందు నామెపైన జల్లి
ఆమె కళాత్మక జీవన
మవని పాలు జేసినారు.
మత సూక్తులు జీవిత ని
ర్మాణమ్మును జేయ లేవు
సరికద! పచ్చని బ్రతుకును
సన్యాసము వైపు త్రోయు.
తరుణుల సన్యాసినులుగ
పరివర్తన జేసి మీరు
సాధించెడు ఘనకార్యము
మేధ కిందుటయే లేదు."

అంటాడు. దీనికి గురుదేవుడు 'కోప సమ్మూర్ఛితుడై తేరొ్కని' ఉరుముతాడు;

"చాలించుము శూద్రుడ! ఈ
శ్రవణ భేది వచస్సులను
అపవిత్ర మగును బుద్ధ జ
యంతి నీవిట నిలిచినను.
నీ కళలను నీవు మాకు
నేటినుండి త్యాజ్యమ్ములు
నిను బహిష్కరించితి నీ
నేలనుండి తక్షణమ్మ
వెడలిపొమ్ము—"

గురుదేవుని గర్జనను విని లోపల ఉన్న శాంతిశ్రీ హృదయం తల్లడిలి పోతుంది. పద్మదేవుడు తనని దేవతగా అర్చించాడు. అతణ్ణి దర్శించే స్వాతంత్ర్యం తనకు లేకపోయింది. కారణం తను మతమనే ఉచ్చులో చిక్కిపోవడమే. అతడు తనకొఱకు ఆచార్యుని చేత బహిష్కరింప బడ్డాడు. కాని తను! ఇలా శాంతి వేదన పడుతుంటే వాళ్ళవాదన పెరిగిపోతుంది.

"కళయనెడు తెరలోన
కామగోపనము జే
సితి"వంచు నతని దూ
షించె గురుదేవుండు.
మతము పేరట మాన
వతను విడనాడినా
రని అతని తూలనా
డెను పద్మ దేవుండు.
తుదకు పద్ముండు తన
హృదయ భాండమున తుక
తుక యుడుకు నుడుల గొం
తుక నుండి విసరె నిటు:
"మానవత్వ సంరక్షణ
మహా ప్రయోజనము కొఱకు
మతము గాని; మీరేమో
మతము కొఱకు మతఘుందుధు,

మీ సంఘారామమ్ములు
మీ బౌద్ధవిహారమ్ములు
సోమరులను పోషించెడు
ధామమ్ములుగా మారెను.
అందరు మీవలె విరాగు
లై పోవుట అసంభవము;
అందరు ఆత్మసుఖమ్ముల
ఆవర్జించంగ లేరు.
మీరు రుజాగ్రస్తులైన
వారి సేవ చేయబోరు.
మీరు దీన మానవులకు
మేలును తలపెట్టబోరు.
సంఘారామమున ధర్మ
శాస్త్రోక్తులు వల్లించిన
సకల జగద్బాధావళి
సమసిపోవలే దెన్నడు.
కృష్ణవేణి యొకవైపున
కెరలి నిండుగా పారగ
మరియొక వైపున ప్రజాళి
కరువు బరువులను కృంగెను.
మత సూక్తుల చర్వణమే
మహితధ్యేయమ్ము మీకు
మానవులుగ మీరు చేయ
బూనిన కార్యమ్ము లేవి?
మత ప్రచారమ్మునకే
మమ్ముల నుపయోగింతురు
కాని కళను సౌందర్యాం
గముగా మీ రొప్పుకొనరు
మీ మతమునకై నాకళ
మీదు గట్టి యుంటకన్న
మానవునిగ నేతు దీన
మానవ కోటుల సేవల.
కళాస్వరూపిణి శాంతిని
కనలేదను బాధమాత్ర
మనసంతము నాదు గుండి
యను తొలుచుచునేయుండును
మీసంకుచిత మతమ్ముల
మీ సంఘారామమ్ముల
విడిచిన నా కళావల్లి
వేముఖాల వికసించును
మందిరాంతరమున నున్న
మామక హృదయ ప్రశాంతి
శాంతీ! నిను చూడకయే
సాగిపోవు చుంటి నిదో!
మరల ఎన్నడైన నిన్ను
దరిసింతు ననెడు ఆశయె
నాదు ప్రాణములను కొన్ని
నాళ్ళ వరకు కాపాడును
నా కళలను నిల్పుకొన్న
నాగార్జున పర్వతమ్ము:
నా శిల్పకళా రథమును
నడిపించిన శాంతిశ్రీ...."

అంతకంటే ఎక్కువగా మాట్లాడలేక అక్కడినుండి తిరుగుముఖం పట్టి వెళ్ళిపోతాడు. గురుదేవునికీ, పద్మదేవుడికీ జరిగిన వాదంలో రెడ్డిగారు వాడిన పదాలకు క్రొత్తవైన, సిసలైన తూనికరాళ్ళను ఉపయోగించారు. నిజానికి మతం, మతం కొఱకే అనడంలో అర్థంలేదు.

—"Perfection of culture, art for art's sake, has no deep root in the heart of man, and flowers but to fade rapidly it strikes a deep root only when it gives a moral representation of life." అన్నాడు ఆల్ఫ్రెడ్ లైల్ (Alfred Lyall). మతంగానీ. కళగానీ కేవలం వాటి కొఱకే కాకూడదు. జీవితంలోని నైతికావస్థని చిత్రించిన్నాడు కళ ఎలా మానవుని హృదయంలో ఒక ప్రత్యేక

తతో పాతుకుపోతుందో అలాగే మతంకూడా 'మానవత్వ సంరక్షణ'కై ఉపయోగపడిన నాడు దానికి సార్థకత. మతంపేరు చెప్పుకుని సోమరులుగా మారిపోతున్న వాళ్ళకు పద్మ దేవుని రూపంలో కవిగారు చెప్పినమాటలు పునః పునః స్మరణీయములు. మతం మాన వత్వాన్ని నిలుపాలి. కాని ఎన్నడూ మాన వులు మతం కొఱకు జీవించడం నేర్చుకో కూడదు. ఈకావ్యం మూలాన మనకు అవ గతమయ్యే ప్రయోజనం ఇదొక్కటి.

పద్మదేవుడు వెళ్లిపోతూంటే శాంతిశ్రీ ద్వారం దగ్గరికి పరువెత్తి వస్తుంది. ప్రక్కన గురుదేవుణ్ణి లెక్కించకండానే పద్మదేవుణ్ణి పిలుస్తుంది. పద్మదేవుడు దిశాంతాల దాకా వెళ్లిపోతాడు. ఆమె సంఘ వాటికలోకి వెళ్లి రాతి సెజ్జమీద పడుకుని నిద్రరాక అవస్థ పడుతుంది మనోవేదనతో. ఎప్పుడో ఆమెకు కన్నంటుతుంది. అప్పుడే స్వప్నం!

అది మనకి స్వప్నంలా అగుపడుతుంది; కాని ఆమెకు యథార్థముగానే తోస్తుంది. ఆమెకా స్వప్నంలో ఒకవైపు కృష్ణానది ఒడ్డు లొరసి పారుతూంటే మరొకవైపు 'గొంతులెండి బీటలు వారిన పండునేలలు' వైరాగ్యం పొంది కండలు పెంచిన భిక్షువులు. అన్నాదుల ్లల్లాడి కన్నుమూసే దరిద్రులూ కన్పిస్తారు. అప్పుడే భోగాలూ, రాగాలూ విడుపుడని వచించే గురుదేవు డగపడ్డాడు. ఆమె కంపించి పోతుంది.

తదనంతరమ్ము సుం
దర మంద హాసమ్ము
తొలకరించెడు నేత్ర
ములతోడ మానవ
త్వామృతము నందించ
నట్టి మతమేల యని
సౌందర్యమే కళకు
సంకేత సదృశమని
ప్రావృడంభోద ది
వ్య స్వరమునను బల్కి
పద్మదేవుడు నిల్చె
స్వాంతము పులకరించె.

ఇవన్నీ పరదాపై చిత్రాల్లాగా కదలి పోతాయి. ఆ స్వప్నంలోనే మరొక స్వప్నం. ఒక సాగరం అగుపడుతుంది. అది నాగార్జున సాగరం.

అలలనెత్తి ఆసాగర
మాహ్వానించెను జనతను
ఓహో! సాగర మదుగో
ఓదార్చెను మానవతను.
దాని కాలి యందెల మం
ద స్పర్శన మాత్రమ్మున
బీటలు వారిన నేలల
పేరెను మరకతశ్రీలు.
యోజనముల కొలదిగ చల
లూపెను నవసస్యమ్ములు
ఎటు చూచిన పచ్చదనము
పొటమరించు దృశ్యమ్ములు.
ప్రజాకోటి వదనమ్ముల
పై కలకల లాడిపోయె
నిత్యపూర్ణిమా నిశలే!
నిత్యవసంతర్తువులే!

ఈ వర్ణనంతా సాగర నిర్మాణానంతరం రానున్న వైభవానికి ప్రతిబింబం. ఆ సాగర తీరంపై హుటాహుటిగ నడిచిపోతున్న కళా మూర్తిని శాంతిశ్రీ పద్మదేవుడుగా గుర్తించి అతనివెంట గాలిలా పర్విడుతుంది.

(తరువాయి 29-వ పేజీలో)

కవిత :

# సన్మానిత

— శ్రీ మంద రామారెడ్డి

సితచేలాంచల ధాళధళ్యములు, దిక్సీమాంత పర్యంత దీ
పిత రోచిర్వలయమ్ము నల్లుకొన; ప్రస్ఫీత ప్రభాపూర్ణ శీ
త తుషారాళులు మౌక్తికాంజలుల నెత్తన్; మంజు మంజీర క్రేం
కృతిలో చిందులు చెంగలించ దిగితే! హేమంత సీమంతినీ!

శ్వేతవెన్నెల వెండి పూతలో దృగ్భాస
రేఖావిలాస సంలీన మొకట;
నిశ్శబ్ద మావరించిన దిశాముఖముల
మందలించెడి రాగమాల యొకట;
ద్వంద్వ ప్రాబల్యమ్ము దలపించి లీలగా
ముడివెట్టు మృదుహస్తముద్ర యొకట;
భరత, శాబ్దికశక్తి, ప్రామాణికముగ ప్ర
స్తావించు మంజులాస్యమ్ము నొకట;
పృథుల శృంగార యుగ రసశ్రీ సమాంత
మొలుక బోసెడి నవభంగిమలను మించు
ఓరపోలిక నెరపు యొయ్యార మొకట;
అరె! బలే!! సరికొత్త సంబరము నీది.

శంకా వృత్తములో భ్రమించు నను, ఆశాముక్తు, హృత్తాపమం
దింకా గాసిలు దగ్ధజీవసుని, నీ నీహారబాహార్ద్రి ప
ర్యంకమ్మే బ్రతికించి బాళినిడి; ఆప్యాయమ్మునందించె; కో
హం కస్త్వమ్మను ప్రశ్నలేదిచట, స్నేహమ్మెంత సమ్మోహమో!

పూచెన్ మూసుకపోయినట్టి కనుదమ్ముల్, అట్టి నాలోని యే
దో చైతన్యము రెక్కగట్టినటు; లెంతో పుణ్యముంజేసి మా
ప్రాచీనాంధ్ర కళాతపస్వినిని స్వప్నంబందు గన్నట్లజం
తా చిత్రాంగిని జూచినట్టులయి; హృద్రంగంబు పొంగారెడిన్.

జారిన యౌవనాన, పసచాలని భావకవీంద్రులోని బం
డారము తీరిపోయెను విడాకులతో ; ప్రణయమ్ముగాల్పు అం
గారపుగుండె అభ్యుదయగాముల దయ్యెను ; వెన్కబడ్డ శృం
గారము నుద్ధరింపనగు, కాదనకే హిమవత్సువాసినీ !

ముకుళమైన్మ పరువమ్ము మాయు యెడదన్ బూయించుచున్ నిత్య నూ
త్నకళా జీవితమున్ రచించు ప్రణయాదర్శమ్ము, వ్రేల్చన్ అలౌ
కిక వాల్లభ్యము నాకులేదు, భవ దంగీకార యోగ్యంబు, నై
శిక సన్మానము స్వీకరించగదె, రాశీభూత రాసిక్యమా !



నాగార్జున సాగరం (27-వ పేజీ తరువాయి)

"తిరిగిరమ్ము పద్మదేవ !
మరలిరమ్ము పద్మదేవ !
ఈ సజీవ శిల్పమ్మును
ఇచటే విడిపోయెదవా ?
యెడదను నానుండి వీడి
పడునట్లుగ జేసిపొమ్ము.
నాతిని నీవొక్కమాటు
రాతిగా నొనర్చి పొమ్ము."

అని ఆక్రందిస్తుంది. హృదయాన్ని చీల్చే ఈ ఆక్రందనం విని అత డర్ధనిమిషం ఆగి సాగిపోతాడు. అతని చేలాంచలాన్నందు కోటానికి ప్రయత్నించింది. గాలి విసురువల్ల అది అందదు.

ఆమె అతని చేలాంచల
మందు కొనెనొ లేదోమరి !
పద్మదేవు డామెను సం
స్పర్శించెనొ లేదో మరి !

ఆమె చూచింది కేవలం స్వప్నమో ! లేక సత్యమో ! కాని ఉన్నత స్వరంలో

"అది నిజమున స్వప్నమైన
నటులె నిల్చియుండుగాక !
శాంతిశ్రీ పద్మదేవు
సాన్నిధ్యము పొందుగాక"

అని ఒక అవ్యక్తస్వరం వినవస్తుంది. ఆ స్వరం నాగార్జున సాగరోర్మికలదో, కళా తంత్రికలదో, గంధర్వ జగద్గీత దోలికలదో కాబోలునని ముగించాడు. ఈ ముగింపు రెడ్డిగారు వినా ఎవరూ చేయలేరు. ఇది నిసలైన నవత్వం. నాయికా నాయకుల పాత్రల్ని ఇంత సమర్థనీయంగా పోషించగలిగినవారు అరుదు. కేవలం విలాస తృష్ణల తీర్చుకోడానికే పద్మదేవుడు కళాసద్మమును వీడటమూ, శాంతిశ్రీ మతాన్ని త్యజించడమూ జరిగిందనే కళంకం వస్తుందని కవిగారు వారి సమాలింగనం స్వప్నంలోకూడా చెయ్యడానికి సాహసించారు కారు. కళపట్ల వారికున్న దృష్టికి, ప్రవీణతకూ ఇది నిదర్శనం. రెడ్డిగారింకా పెక్కు కళాఖండాల సృష్టికి కారకులవాలని లోకం ఆశిస్తుంది.



ఊహాచిత్రం :

# నా రా ణి

— శ్రీ దక్షిణామూర్తి

వనజ.... పేరును చూస్తేనే ముద్దొస్తోంది. మనిషిని మనసారా చూస్తే యింకెలావుంటుందో.... వనంలో విహరించే హరిణంలా.... చిలుకల సరసులో తెల్లని చలువరాతి బండల మలపున నిలిచి నగవుల చిలుకరించే కలువపూవు మోములా....గాలానికి తగలక తప్పించుకు తిరుగాడే చేపలాంటి కన్నులు.... మలయమారుతానికే సోలిపోయే చిన్నారి మృదుల మంజుల భామిని.... యింకేమని కొనియాడుదును.... ఏమని వర్ణింతును....హృదిలో పులకరించే నా చిన్ని వూహనే యింతటి వైరుధ్యాన్ని కలిగిస్తుంటే ఎదురుగా దర్శనమయ్యే స్త్రీమూర్తిని చూచి నిలువగలనా.... ప్రకృతి ప్రసాదితమయిన ప్రతివస్తువు ఆమెలోని ఏదోవక అంగాన్ని పోలివుంటుంది.... చేపకనులు.... సింగపునడుము.... మంచుకొండల నుండి మెండుగా వడివడిగా జారెడు సెలయేటి జాలులబోలు ఆమె కేశములు.... మచ్చలేని అచ్చపు చందమామ మోమును సైతము వెక్కిరించి ధిక్కరించగల చిక్కని నిక్కపు ఆమె కనుముక్కు తీరు. గాలి వాలున కొరిగి ఎగిరి పోగల సున్నితపు ఆమె జలతారు ముసుగు మబ్బు కన్నెల ముసుగుల మరిపించి మురిపించగలిగినది కావచ్చును... అయిన ఆమె అంగాంగము ప్రకృతిలోని ఏదోవక చాతుర్యమునుబోలి యున్నదే.... అన్ని రూపుల లాలసత్వము ఆమె రూపులో పొదుపబడినదే.... ఆమె ఎవరు....? ప్రకృతిబిడ్డ- పసిబిడ్డ.... పసితనపు ఛాయలు పదిలముగా వదలక కదలక మెదలక లతికలాగు అల్లుకుపోయిన చిన్నారి పసి మోము.... ఆమె వనదేవత.... వనలక్ష్మి.... ఆమె వనదేవత కాకపోవచ్చు.... ఆమె వనదేవతకు జన్మించినది. జాతి మాత్రాన అమ్మపోలిక లబ్బినట్లున్నవి. ఆమె వనజ.... పేరు అందుకనే పొందుపరిచినట్లున్నారు. నామంతో సరితూగే సహజ సౌందర్య పటిమ ప్రతిభాసిల్లే ఆమె వనజ.... అవును నిజంగా వనజే....

వనజా.... లతలకు మారాకు లతకలేక మనసు సొలిసిన మనీషివా నీవు.... ఎందుకలా నిలువునా నీరై కారిపోతున్నావు.... తామరతంపెరల తాకిడికి తల్లడిల్లిపోయావా.... పూదేనె గొనిపోవ పరుగులెట్టెడి తుమ్మెద ఝుంకారములకు అదలి వడిలిపోయావా....మలయమారుతపు సన్నని వీవనకు హదలి వాడిపోతావా....

కదలవేం వనజా ...చైతన్యం కనపడదేం.... అలా నిలబడిపోయా వెందుకు.... అయ్యో కనురెప్ప నార్పవే.... నన్నదరించి బెదరించుటకు కనుయంచుల సవరించు కొనుచున్నావా.... తొందరపడకు వనజా.... వేగిరపడకు వనజాక్షీ.... వనజాక్షీ అనే సంబోధనలో మొరటుతనం వెగటు కలిగిస్తున్నదా.... వనజా యిలా పిల వనా.... వనా.... నా వనా.... వనజా.... వేగిరపడకు వనజాక్షీ కనులార్పవూ.... భవదీయాక్షి వీక్షణముల నను ప్రహరింప పూనికొంటివా.... వలదు.... వలదు వనా.... కనులార్పి నన్నొకసారి కనులార కాంచుము.... పరాయపురుషుడనని వెర పడుచున్నావా.... మొన్నదాక పొన్నపూల పంచలో దాగిన పుప్పొడివోలె దాచు కున్న కన్నెరికాన్ని వన్నెలు దీరనినాడు వహ్నిలో వెన్న విరిగినట్లు.... జలధి పొంగినటుల.... ధరాధరం పగిలినటుల....యింకా.... ఏదైనా అగునని కలతచెందు చున్నావు. ....పగులు చూపని హృదయానికి పూత మెరుగులు దిద్దే సావకాశం నాకు కలిగిస్తావా.... పగులు లేని సెగలురాని మొగలు పోని పరితప్త హృదయానికి పరితృప్తి అనుగ్రహించటానికై అరుదెంచిన నీఆరాధ్య దేవతను నేను.... అధిదేవ తను నేను.... భవదీయ అధిదేవతల కారాధ్య దైవాన్ని నేను.... పరపురుషుని పాషాణ పాణిని పరిగ్రహించలేక.... యిటుచూడు వనజా.... వద్దు వనజా.... కను లార్పు మొకసారి.... రెప్పలారని నిండుగుడ్ల సౌరును తిలకించలేక తల్లడిలుతున్న నాకు ప్రాణభిక్ష ప్రసాదించు.... నన్ను నీవాని జేసికొమ్ము.... నీవు నాదానవుగా నక్కరలేదు.... నన్ను నీవానిగా గైకొన్న చాలును.... నాజీవన పర్యంతం నావనజా.... అబ్బ ఎంత తీయని పేరు.... తినుబండారముల తీపినే ఎరుగున్న నాచెవిటి నోటికి తీయని మాటల తినుట నేర్పిన నిన్నేమని గౌరవింతు.... కృత జ్ఞత నెంతని నివేదింతు.... నాతో మాటాడవూ.... కోపం వస్తుంది వనజా....

చూడు.... జన్మజన్మాల పుణ్యాపు మూట తరతరాల పెరిగి మనతరాన ఫలించింది.... నాజన్మ సఫలమయింది.... నారాణి వనజగా మారింది.... నావనజ నారాణి అయింది ... నావనజా నారాణి.... నావనజరాణి.... నావనరాణి .... నావరాణి.... కనులార్పవు వనజా.... కదలలేని పూదేనె గొనిపోవ నెరబూని యరు దెంచు.... మానవతేనెటీగనుగాను.... నినుచూచి నిలువలేక కలతచెంది పలువ రించు పసిబాలుడను.... తప్పిదం నాదికాకపోయినా నీదిగాదని తెలుపుటకు చాలని గుండెలనిండుగాజేసి మాటాడగలిగాను.... మదివిప్పగలిగాను.... మాటరాని మోముతోటి గోడుగోడున గోడంతా తడబడకుండా వెడల నడిచాను....

ఆ.... ఏమది....ఎవరది.... ఎక్కడున్నాను.... పగటి కలలు నిజంకావు గదూ.... ఇదే రాత్రయితే ఎంతబాగుండేది.... రాత్రి వెలుతురులో జలతారు వోగుల చల్లని పిల్లగాలి తెంపెరల జలజల వూగులాడే సమయాన నాశరీరాన్ని వది లేసి గాలిలో కలిసిపోయి జలజలరాలు పూలబాలల ఉయ్యాలలూపి నాప్రేమమూర్తి నా వనజ శిరోజాల పొదిలోకి పదిలంగా పట్టుకువచ్చేవాణ్ణి.... నారాణి నన్ను చూచి నవ్వేది.... ఆమె నవ్వుల వెలుగుకు చంద్రుడు సైతం భయమంది మబ్బులమాటున మణిగిపోతాడు.... అందాల చందమామ నారాణి ఎదుట నల్లని సాలగ్రామం.... వెలుగులేని కొడిగట్టిన దీపశిఖ.... ఆనవ్వులో.... ఆకాంతిలో ఆమెచెంత ఆమెలో లీనమయి.... ఆమెతో నేకమయి.... ఆమే, నేనూ వక్కరమైతే.... ఆమె నేనై పోతే.... నాజీవిత పర్యంతం.... నాభావన లనంతరపు చాలని గోడలపైకి పెట్టని నిచ్చెనపైగా నింగిపై నాభుజాగ్రమ్ముల నిండుగా పొంగించి వక్క ధుముకు గబుక్కున దుమికి.... అనంతంలో అంతమయి ఆమెగామారిపోయి.... అబ్బ అంతకంటే కావలసిందేముంది.... అంతకన్న కోరుకొనగలిగిన దేముందగలదు.... అంతటి అదృష్టం నాకబ్బితే.... తియ్యని తేనియల తనివిదీర తడుపుకొనెడి నా ప్రేమగులాబి ముళ్లు లేని గులాబి....

ఆ.... ఎవరు.... నాముందున్నది నే గీసిన చిత్రమూ... ఆ.... భయం వేస్తోంది.... కాదు.... పో.... నారాణి నంతమొందించి నాచూపున నీ పటమును నిలిపిన పిరికిపంద..?. కాదు ధైర్యశాలి కాదు.... కాదు.... ఆ దురాత్ముదెవ్వడు.... నిండు మనిషి నిలువెల్ల సొలసునటుల నా హృదిని పగులవైచిన దెవ్వరు.... డమ్ములులేని పిరికిదద్దమ్మలు నా నిద్దరలో నాముద్దుల మోమును హద్దు పరిచిన కిరాతకు దెవ్వడు....ఆ.... కలగంటున్నాను ... తెలివిగనిన తదుపరి తిరిగి కల గనే.... నా ఆలోచనే తెలివిమాలిన తెల్లమొగపు నా మదిని కదిలించివేస్తుంది.... హృదయాన్ని పదిలపరచుకోవాలి.... నాకల నిజమో కల్లయో నిజంగా తెలుసుకో వాలి.... ఏదీ చిత్రాన్ని వకసారి తాకనీ.... ఎక్కడా.... వద్దు చెక్కిళ్లను తాక టానికి తలపడుతున్నావా.... కందిపోన్నూ.... తొలగిపో....

అవును అర్థమయింది.... నాభావన వీకగానోకిన భావము నాకు అగుపడింది. అదే నా వనజ.... నావనజను పరికిస్తూ నవ వసంతాలతో నిండారునట్లు నావనజను.... నావనరాణిని ఫలకమ్ముపై పదిలపరిచాను.... నాజన్మసాఫల్యం అవుతుందా....

నాభావదీపం ఫలకముపైని చిత్రంలో ప్రాణాన్ని వెలిగిస్తుందా... నావనరాణి నన్ను చూచి ప్రాణాలను తెచ్చుకుని చిరునగవుల పలకరిస్తుందా.... ఏదీ మనసార నన్నొకసారి.... కాదు నిన్నొకసారి.... అదేమిటీ.... చెక్కిళ్లు కందినా యేమిటి.... ఏదీ.... ఛీ.... చేతితో తాకుతున్నానా.... యింకా కందిపోదూ.... నాభావన భావనగానే నిలిచిపోయిందేం.... వెర్రివానిలాగున్నాను ... వికలమైన మనస్సుతో విరిగి వంగిపోయిన పూలశయ్యలాగుంది. నా విమల హృదయం.... కుంచెతో చెక్కిలిలోని ఛాయను సవరింతునా.... పెదిమల మృదుమధుర మంజులహాసాన్ని యినుమడించనా....నీమోవిపై ఏరంగు లతకను.... ఏ వన్నె చిలకను.... ఏదీ కుంచె.... ఏమిటీ ఆలోచన.... వక్రబుద్ధి.... కుంచెల కేశములు సోకిన నారాణి చెక్కిలి నలిగిపోదూ.... నావనజ అధరము లదిరిపోవూ.... మనసిప్పి మాట్లాడని నావన్నెలాడికి వన్నె లతికి యతికి ఎంత బాధించాను.... ఇశ్.... తెలివితప్పి మెప్పులేని తప్పిదాన్ని పొనరించిన నన్ను నారాణి స్వీకరిస్తుందా.... నామనసు నారాణి కెరుక.... నాతలపు నా వనజకు తెలుసు.

అర్థమయింది ... అవగతమయింది.... అవలోకన సాకల్యంగా చేయగలుగుతున్నాను.... నా భామిని నిజంగావస్తే కామప్రలోభంతో అవమానం చేసేవాడిని. అనుమానం మనస్సున నిలుపలేని మానినిగా నా భామిని గుండెలదుర వలపుచెదిరి విలపించేది.... ఈనాడే బాగుంది.... నారాణి ఫలకం మీదనే ప్రకాశమానంగా వుంది.... అక్కడే వుంటుంది నావనజ.... నేను చిత్రకారుడనై యిక్కడే నిలిచిపోతాను....నా భామ ఎదుట కదలలేని రాయిలా కలకాలం నిలిచిపోతాను. చిత్రకారుడనై చిరకాలం జీవించలేక అనంతంలో అదృశ్య మయిపోతే ... అమ్మో అలా వీలులేదు.... యిప్పుడే శిలనైపోతాను. శిలాశిల్పినై పోతాను.... నావనజ ఎదుట యిక్కడే యిప్పుడే యిట్లాగే చిరకాలం నిలిచి పోతాను. నావనజా నేనూ వక్కటైపోతాము వక శుభదివసంనాడు.... అంతే....



సమీక్ష :

# ఎంకి పాటలు 3 - ఎంకి

— శ్రీ సుప్రసన్న

నాయుడుబావ ఎలా మిగిలిన ప్రబంధనాయకుల కంటె విభిన్నత కలిగి ఉన్నాడో అలాగే ఎంకి కూడా పూర్వ నాయికల కంటె విభిన్నమైన స్వభావం కలది. మన పూర్వ కావ్యాల్లో నాయికకంటే నాయకుడే ఎక్కువ గొప్పవాడై ఉంటాడు. కాని ఈ కావ్యంలో ఎంకియే నాయుడుబావకంటే చాలా గొప్పవ్యక్తి. ఈ కావ్యం మొత్తం చదివిం తరువాత ఎంకి ఒకానొక దివ్య ప్రణయం పొందిన రూపంగాను, నాయుడుబావ ఆ ఎంకిని ఆరాధించడానికి పుట్టిన ప్రణయ భక్తుడుగానూ తోస్తాడు.

ఎంకి పల్లెటూరి మనిసి. ఆమెకు అక్కడి సర్వసౌందర్యాలు తెలుసు. అక్కడ అన్నిటికన్నా సౌందర్యమయమైన ఒక నిధిని ఆమె చూచింది. ఆమెకు ఆనిధి నాయుడు బావ. ఆయన్ను ఆమే వరించింది. బులిపించింది. విలాసాల ద్వారా ఆకర్షించింది. అతని హృదయంలో ఆరాధ్య దేవతయై నిల్చిపోయింది.

ఎంకిని నాయికా లక్షణాన్ననుసరించి ముగ్ధ - మధ్యమ - ప్రౌఢ- అనే మూడు తరగతుల్లో దేన్లో చేర్చాలి అంటే ఆమెలో ఈ మూడు దశలూ ఒకదానిని దాటి వేరొకటి అక్రమించినట్లు చెప్పాలి. పాటల్లోమాత్రం ఇన్నిపాటలు ఈదశ అని విరిచేసి చూపలేం. కొన్ని కొన్ని పాటలలో కొన్ని కొన్ని దశలు కనిపిస్తున్నవి. మొత్తంమీద ఎంకిలో ప్రౌఢత్వం పాలు ఎక్కువ.

నాయుడుబావ అమాయికంగా ఉన్నప్పుడు ఎంకి ప్రౌఢగా, ఎంకి అమాయికంగా ఉన్నప్పుడు నాయుడుబావ కొంటెగా వ్యవహరించడం ఉంది. ఎంకి నాయుడుబావతో "నీతోనె ఉంటాను నీమాటె యింటాను" అంది. అప్పుడు వాళ్ళ సంభాషణ

నాయుడు : సరుకులేమి కావాలె సంతన పిల్లా ?
ఎంకి : నువ్వు మరమమిడిసి మనసివ్వు నాయుడుబావా
నాయుడు : సక్కదనము కేమిత్తు సంతన పిల్లా ?
ఎంకి : నువ్వు సల్లగుండ పద్దాక నాయుడుబావా
నాయుడు ; యేడనే నీకాపురమో యెల్తురు పిల్లా ?
ఎంకి : నీ నీడలోనే మేడకడతా నాయుడుబావా !

ఇలావుంది సంభాషణ. మన పూర్వ నాయికలే అవుతే నీకేం కావాలి అన్నప్పుడు పారిజాతమో, రాజ్యమో, మాయా గృహమో కోరేవాళ్లు. వీళ్ళిద్దరిమధ్య ఉన్న స్నేహం ఈలౌకిక జగత్తుయొక్క సరిహద్దులను దాటి పారలౌకికమైంది. అంచేతనే ఇలాంటి వాంఛాళిని చూడ గల్గుతున్నాం.

ఎంకి పాటల్లో ఎంకిని దర్శిస్తే అష్టవిధ నాయికల్లో ఏదో ఒక నాయికా భేదంలో ఆమె చేరుతుంది, ఒక ఖండితా నాయిక లక్షణం తప్ప. ఎందుకంటే నాయుడుబావ దక్షిణ నాయకుడు కాడు.

పాటల్లో చాలాభాగం ఎంకి స్వాధీన భర్తృకగా కనిపిస్తుంది. 'నాయెంకి' అనే పాటలో నాయుడుబావ ఎక్కడికో పోయి రెండురోజులముందే తిరిగి వస్తానని ఇంకా రాలేదు. అంచేత ఆమె మనసులో మనసులేదు.

"నీలుతే బోతుంటె నీతోడె - వోలమ్మి !
నాయెంటె యెవరోను నడిసినట్టుంటాదె !
అద్దములొ సూత్తుంటె అదిఏటొ సిగ్గమ్మి !
నాయెనక యెవరోను నవ్వినట్టుంటాదె !
సల్లన్ని ఎన్నెట్లొ సాపేసి కూకుంటె—
ఒట్టమ్మి ఒల్లంత ఉలుకులికి పడతాదె !
నీకైనవోడె నారాతెట్ట గుండాదొ !
కళ్ళల్లొ సత్తెముగ కట్టినట్టుంటాదె !"

ఆమె మనస్సులో నాయుడుబావను గూర్చి వున్న భావాలు ఆయన ఎడబాటుతో ఆమెలో కలిగే అవస్థ ఈ పాటలో కనిపిస్తుంది. ఆమె ఏపనిచేసినా తన ప్రియుడు తనవెంట వున్నాడనే భావం తోస్తుంది. ఐనా ఆమె మనస్సులో అతన్ని గూర్చి ఎట్టి దురభిప్రాయమూ లేదు. అంచేతనే 'నీకైన వో'డని చెప్పింది.

మనకు ఎవరియందు ఎక్కువ ప్రేమ ఉంటుందో వాళ్ళనుగూర్చి వార్తలు తెలియనప్పుడు వాళ్ళకేదైన అపాయం కలిగిందేమో అని శంక కలుగుతుంది. మనస్సులో వోమూల ఏం భయంలే అనిపించినా అపాయాన్ని గూర్చిన శంక మనకు బాధిస్తూనే ఉంటుంది.

"ఆ కాలపు నాఎంకి" అనే పాటలో ఈ రకమైన భావం గోచరిస్తుంది.

"దూరాన నారాజు కే రాయిదౌనో ?
ఈరోజు నారాత లే రాల పాలో ?
కళ్ళకేటో మబ్బు కమ్మినట్టుంటాది—
నిదరల్లె నావొల్లు నీరసిస్తున్నాది
ఆవు లంబాయంట అడిలి పోతున్నాయి
గుండెల్లొ వుండుండి గుబులు బిగులౌతాది."

ఈ రకంగా విప్రయోగంవల్ల ఆమె బాధ పడుతున్నది. ఆమె మనసులో మనసులేదు. ఆమె ప్రవర్తనలో మార్పు వచ్చింది. అప్పుడు ఇరుగుపొరుగు వాళ్ళూరుకుంటారా ? ఉపచారాలు చేశారు. చెప్పారు. వెక్కిరించారు. దాంతో ఆమెలో ప్రియునిమీద కోపంవచ్చింది.

"ఉత్తమా యిల్లాలు నోయీ !
నన్నుసురు పెడితే దోసమోయీ !

గాలెంట వోయమ్మ దూళంట వోయమ్మ
యిరుగు పొరుగోరంత యిరుగబడినారంట
యీపూది వొకతట్టై ! యీ పింకొక తట్టై
నీలు సిలికే దొకతె ; నిలిసి సూసేదొకతె
సాటునుండే ఎంకి సబకు రాజేళావ ?
పదిమంది నోళ్ళలో పడమంట రాళాద ?"

గుట్టుగా సాగే సంసారంలో ఇరుగుపొరుగు వాళ్ళ జోక్యం ఆమెకు కష్టాన్ని కలిగించింది. ఆమెకు నాయుడుబావ ఎన్నో వాగ్దానాలు చేసినాడు. ఆయన అవి పూర్తిచేయలేదు. వాటికి సాక్ష్యం చంద్రుడు. ఆ విషయాలను గూర్చి చంద్రునితో చెబుతున్నది.

"'కలకలా యీ దినమె నిలుసుమన' కన్నాద
'గాలికైనా తాను కవుగిలీ' నన్నాద
నాకాసి సూళాద నీకాసి సూళాద
'మద్దె సెంద్రుడె మనకు పెద్దమని'సన్నాద"

ఎంకియొక్క ఈ అవస్థ చూచినాక చంద్రునికి కూడా జాలి కలిగింది. అందుకే "కన్నీరు నీకేల సెందురూడా ! కనికారమే శాన సెందురూడా !" అన్నది. తనవల్ల ఇతరులకు బాధ కలగటాన్ని ఓర్వలేనిది ఎంకి.

ఒకచుక్క కొండపైకి రావడంలో తాను వస్తానన్నాడాయన. అంచేత బారెడైనా జారిందేమో చూడమంటుంది. 'తోట ఎలపల గలగల' 'ఆవుమెళ్లో మువ్వలమ్రోత' విని అతడు వస్తున్నాడని తెలుసుకొన్నది.

వెన్నెలరాత్రి. ఒక్కతె. ప్రియుడు లేడు. ఆమె ఆ ఒంటరితనాన్ని ఓర్వజాలక పోయింది.

"ఈరేయి నన్నొల్ల నేరవా రాజా !
ఎన్నెలల సుకమంత ఏటి పాలేనటర !
మెలుతురంతామేసి యేరు నెమరేసింది
కలవరపు నాబ్రతుకు కలతనిదు రయ్యింది
ఒక్కతెను నాకేల ఓపజాలని సుకము"

ఆమె బ్రతుకు కలవరంతో కూడింది. అంచేత కలతనిదురతో పోల్చికొంది తన ప్రియునియం దెంతో కాఠిన్యమున్నట్లామెకు తోచింది. జడవస్తువుల్లో కూడా ఇంత కాఠిన్యం లేదట.

"రాలు రేలును పూలె జాలి నొలికెడురా
వేలుపే నీకంటె చాల సులభుడురా"

అంటుంది. కొండల్లో తాను నడిచేప్పుడు ప్రతి శిఖరమూ ఆయన ముఖం చూపుతుందిట ! ఒక్క ఎంకినే మల్లల్లోచూచి రాత్రి ఆయన కళ్లను చుక్కలుగా ఆయన నిలువును మొయిళ్లగా ఆకాశాన చిత్రిస్తుందిట ! పూవుల లతలు ఆమెవలెనే వెతలపొంది మెలికలై ఆయనరూపు

కళ్లగప్టేట్టు చేస్తాయట ! ఏమీ కోరకుండా స్వామిముందు హారతిపట్టుకుని నిల్చుంటే వెలిగే మూర్తి ఆయనదేనట !

ఎంత గొప్ప భావనాశక్తి ఉన్నదీమెకు. నాథుని వియోగంవల్ల బాధపడి బాధపడి తుదకు సర్వప్రకృతిలోనూ ఆయన్ను సందర్శించింది. ఆమెకు ఆయన తప్ప వేరేలోకం లేదు.

ఈ (జాలి) పాట చదివాక భగవంతునికోసం వెదకి వెదకి భగవద్భక్తు లాయన్ను సర్వాంతర్యామిగా సందర్శించి "ఇందుగల డందులేడని సందేహమువలదు చక్రి సర్వోప గతుండు (పోతన)" అని నిశ్చయించిన ఘట్టం గుర్తురాక మానదు.

ఎంకిలో చురుకుదన మెక్కువ. ఆమె బుద్ధిలో ఊహలు పద్యముగా ఉద్భవించు చుండును. ఆమె అప్పుడప్పుడు నాయుడుబావకు వ్యంగ్యముగా చురుకు తగిలిస్తుంది.

"గాయపడిన లేగకు నే సాయమిడకె సాగిపోవ
చిలుకను పుసికొలిపి నన్ను "శిబిరాజా" యనిపించిన
కలలో తన సెలవు లేకె నిలబడి పోతినేమొ
మెలకువగని చిలుక పిలిచి నలరాజాయనిపించిన"

ఇలా చేస్తుంది ఎంకి. అందుకే ఆయన 'ఎగితాళియు ఎంతొ సొగసు ఎంకి చిలుక మనుసె మనుసు' అంటాడు.

ఎంకి వనదేవిని కనబోయి వాళ్ళిద్దరికీ ఎడబాటు కలక్కుండా చేసుకున్నది. ఇంట్లో ఈయన్ను విడిచి ఆమె ఒంటరిగ పోయింది. వీళ్లిద్దరి నటనకు ఆనవాలుగా కంఠహారంలోని వేయికళ్లు సుడిపడ్డాయట. తుదకు 'వనదేవితో గుడిని మనివాయెనో లేదొ—యింతలో యింటిలో మెటుచూసినా ఎంకె' భర్తకోసం ఎంకి దేవిని కూడా ప్రసన్నం చేసుకున్నది.

"కనుపాప" అనే పాటలో ఎంకియొక్క గొప్పశక్తి మనకు కనిపిస్తుంది. ఆమె తనకు తిలకాన్ని తీర్చే ఘట్టం.

"అద్దమేలంటాది అందాలు తెలుప
ముద్దు మాటల కెంకిదే ముందు నడక
కంటిదరి నాకాడ కనిపాపలో నీడ
సూసుకొంటా నొసట సుక్కెట్టు కుంటాది
కనిపాపలో నీడగని నవ్వుకొంటాది
మొకము సిటిలిస్తాది రకరకము లవుతాది
కంటిదరి నాకాడ కంటనీరెడతాది
కనిపాపలో నీడ మనసదర గొడతాది"

భర్తయొక్క కనుపాపల్లో తన ప్రతిబింబాన్ని దర్శించి ముఖాన్ని తీర్చుకోనే నాయిక యెంకే. ఈపాటలో ఎంకియొక్క అమాయిక భావం మనకు గోచరిస్తుంది.

ఈ మాయలు తెలియనితనం ఈ పాటలోనే కాక మరోపాట 'ముత్యాల పేరు' అనే దాన్లో మరీ గోచరిస్తుంది. ఆపాట ఇద్దరి సంభాషణ రూపంలో ఉంది.

యెంకి : అద్దములో నారాజు అంత నీరూపు
ఇంత ముత్తెములోన ఇంకె నేలాగు ?
నాయుడుబావ : ఇన్ని పొంకాలున్న యెంకివే నీవు
ఇంత నాగుండెలో ఇమిడి పోలేదా ?

అంటాడు. ఈ పాటంతా ఇలానే నడుస్తుంది. యెంకి 'అటూ ఇటూ తిరగవు అణిముత్తెములో ఆడిపోతావు ఈమర్మమేంటి' అని అడిగితే నాయుడుబావ 'కునుకులా సినుకులా కూర్చుంటే నీవు మనస్సులో గంతులేయవా' అంటాడు.

ఇంత అమాయకురాలైనా ఆమెతో ప్రవర్తించడంలో జాగ్రత్తపడాలి. ఆమె ఎప్పుడూ సున్నితం పోనీకుండా కటువుగా మాటాడకుండా చూస్తుంది. ఇంకా—

సూపుతో మాటాడి పూపిరితో తెనిగించు
కనుబొమ్మతోనవ్వి మనసు కరిగించు
మన యెంకియని, కాని సనువులకు పోరాదు
తొలిగినా కలిగినా దూరదూరానే

ఆమెలో ప్రవర్తన కత్తిమీద సాములాంటిదట ; కత్తిమీద కూడులాంటిదట ;

ఆమె ఓసారి సముద్రాన్ని చూచింది. సముద్రాన్ని గూర్చి పూర్వం ఆమె ఎంతో గొప్పదని విందిట, కాని ఇప్పుడలా లేదట.

"ఇంతేనటే సంద్ర మెంతో అనుకొంటి. మనకు సూరీడుకూ మద్దె నుందేనా ?" అని ఆశ్చర్య పడింది. కాని ఆమె జీవితంలో కొన్ని ఘట్టాలలో కొందరు తన మనస్సు సముద్ర మైందన్నారట. ఎంకి నీతి, జాతి వాళ్ళే పోనాడినపుడు ఆమె మనసు సాగరమైందనీ, నాయుడుబావ తనవేపు వేరేసూపులు సూస్తే ఆమె గుండె కడలివలె తడబడిందనీ, సత్తె మెరిగిన పాప పొత్తిళ్ళలో దాగి కన్నీరు మున్నీరు కరగించావనీ అన్నారట. కాని సంద్రం చూచాక ఇంతేనా అనిపించింది. అంచుదరి ఉండదనీ అమృతముంటుందనీ అన్నారట. అంచేత ఆమె సంద్రం దేముడంతా ఉంటుందేమో అనుకొందిట, కాని ఆమె ఆశలు అలా కాక ఇంకోతీరుగా ఫలించినై.

ఓరాత్రి ఒంటరిగా ఏటిదరికి పోయింది. ఈరాత్రి ఒంటరిగా ఎందుకొచ్చావు ? ఏటి గలగలెందుకు వింటున్నావు ? చంద్రవొంక చూస్తున్నావు ఏంచిత్రముంది ? అని అడిగితే ఎంకి ఆయన నేనూ ఇక్కడే ఆడినాము. ఈఏరు మావాడి మనసులా ధ్వనిస్తున్నది. చంద్రుడస్తమించగానే ఆయన వస్తాడని చెప్పింది.

కాశీరాణితో ఎంకి తన మొర చెప్పుకుంటున్నది. 'ఆయన తనకళ్ళలోకి చూస్తూ ఎక్కడో మనసుంచుతాడు. వలపిచట తలపచట ఆయనకు తగునా ? ఒంటిగా దినమంతా వనంలో తిరుగుతాడు. ఆయన దగ్గర నీడకున్నంత చనువు కూడా లేదు. ఇంటి కలిసి అలసి వచ్చి బాధ నడగనీయడ మనసుతో పాదాన్నైనా ముట్టనీడు.' అని చెప్పి ఆయన మనస్సు తన మనస్సు కలుప మంటున్నది.

"నవనీతమేరాజా - అవలీల పని నీకు
వలపు మాటల కెంత - శిలలైన కరుగునే"

అని చెబుతున్నది. అసలే ఆయన మనసు నవనీతంలాంటిది వలపుమాటలు శిలలైనా కరిగిస్తయ్. అంచేత ఆయన మనస్సు ఊరికేనే కరిగిపోతుంది. ఇది నీకు అవలీలయైన కార్యం అని చెప్పింది.

ఎంకికి నాయుడుబావ మీద అపారమైన ప్రేమ ఉన్నది. ఈ ప్రేమ సాధారణమైంది కాదు.

"ఆట పాటలలోనె మరచినావా రాజా ?
వరస దీపాలుంచి సరసనే నిన్నుంచి
ఆ కాంతి నీకళ్ళ గని మొక్కుకొను నన్నె
నెలవంక పలవలో నీరూపె గీతురా
తలవంచి నెలయేట ఆరూపె సూతురా
కలలోన నీవు నా కంటి కవుపడకున్న
మెలకువయ్యేదాక కలవరించే నన్ను"

ఇలా "నీకోసం జీవితాన్ని సమర్పించి మనస్సు త్యాగంచేసి నీవు లేకుండా క్షణంకూడా జీవించలేని నన్ను విడిచినావా అని బాధపడింది. ఆమె సుకుమారమైన మనస్సులో గాయమైంది. దుఃఖం పెల్లుబికింది. కాని—

"కందు పెరుగని మనసు గాయమైపాయెరా
నీకె చేటని కంటనీరు రానీనురా"

అంది. ఇలాంటి సమయంలో "కాంభోజీమేళ విపంచికారవ సుధా పూరంబు తోరంబుగాన్" ఏడ్చిన 'రాజీవాననలు' ఆకాశముం దధఃపాతాళాలలా కనిపిస్తారు.

ప్రియుడికోసం కొండాకోనా తిరిగి గరికెపూల కంఠమాల కూరుస్తుంది. పూలగిన్నెల్లో ఆవునడిగి గుమ్మపాలు, అడివినడిగి కొమ్మతేనె పొందుపరుస్తుంది. వెన్నెల్లో పచ్చిక బయళ్ళలో ఇద్దరూ 'కోకో' అంటూ విహరిద్దాం అంటుంది. ప్రియుణ్ణి ఆమె చెప్పినట్లు వినేట్లు చేసుకున్నది.

"నాకంట కననీదు నాకంఠ మననీదు
తనులేని కలయేని కనినే మనగరాదు
తలపోసి మాకలలు కలబోయవలెనంట
గౌరీశులకె బాగ గరవభంగముకాగ.

వాళ్ల కలలో కూడా పరస్పరం వాళ్ళనే చూచుకోవాలి. లోకంలోనైతె ఆయనను ఇష్టం వచ్చినట్లు చూడనీదు, పలుకనీయదు. అప్పుడు వాళ్ళిద్దరిదే. ఇలాంటప్పుడు కలలో వాళ్లకు కలిగే దివ్యానుభవాలు చాల ఉదాత్తంగా ఉంటాయేమో ! అంచేత వాటినికలబోస్తే గౌరీశులకు కూడ గర్వభంగం కలగాలిట,

ఈ కావ్యమే ఎంకిపాటలు కాబట్టి ప్రతి పాటలోనూ ఎంకియొక్క వ్యక్తిత్వంలోని ఒక పార్శ్వం (One face of the personality) కనిపిస్తుంది. అన్నింటినీ ఇక్కడ చూపటం సాధ్యం కాదు.

ఎంకి, నాయుడుబావ కలిసి ఓసారి చేసిన జలక్రీడ బహుసుందరంగా అభివర్ణింపబడింది.

"మడుగున జలకమాడ మా నీడ లలలపై
గోరంత మానటన కొండంత చేసెనట
నీలపై మారహస్యాల గొని తీరతీ
రాల పరుగిడి మమ్ము గాలి ఎగతాళియట
మెరపు మేఘులమించు సరసులను మముగాంచి
ఆకసమె పులికి మడుగడుగున పడినదంట
రతనాల వేదికను రవల చాందినికింద
ముత్తెపు తలంబ్రాలు మునిసుల పెళ్ళంట"

ఈ జలక్రీడా వర్ణనం సామాన్యం అయినా ఈరీతి అసామాన్యమైంది.

ఎంకి రవల వెలుగుల గంగ రమ్మంటే పోయి ఆవెలుగు దేవతకు చక్కిలిగింత పెట్టింది.

"నటీనటులు" అనే పాటలో

"ఇంత ఎంకితో నటన
ఎవ్వరోనట ఈత
డెవ్వరోనట ఎంకి
రవ్వపాలంటా" అంటే
"ప్రకృతి సుందరిజంట పరులకెటులంట"

అని ఉత్తరం వస్తుంది. ఈ ఎంకి సామాన్య స్త్రీ కాదు. ఆమె ప్రకృతి. నాయుడుబావ పురుషుడు. ప్రకృతి పురుషుల సమ్మేళనమే సర్వజగత్తు. తల్లీలా కించిల్లేశమును అభివర్ణించినవి ఎంకిపాటలు. ఎంకి నాయుడుబావలును ప్రకృతి పురుషులనుటకు సంకేతములు.

ఈ కావ్యములోని శృంగారమును గూర్చి ముందు ఆలోచిస్తాం.



గేయం :

# అజేయుడు

— శ్రీ జె. బాపురెడ్డి

ఓటమి నా కనునీడల
కోటలు దాటేకాలం
జగద్గోళమున గాలులు
చలియించేదాక రాహు-
శరదంబుదు డెవడో గ
ర్జన చేసెను నా కెదురుగ
నా ఉఛ్వాసానిలాన
నలిగి నశించే దెరుగక-
పాపం తన కరవాలం
నాపైకే విసరె నెవడొ
వజ్రాయుధమే నాకు
వశమైపోయిన దెరుగక-
నడియాకాశమ్మున వె
లైడి కాంతినిధినగు నాపై
కుటిలాత్ముండెవడో చీ
కటి దుప్పటి కప్పజూచె
పురిటిలోనె నిశా గోళ
మును కాల్చిన నన్నెరుగక
నా జీవితమున రాభణ
రాజెవడో నిప్పుదూర్చె
వానిబ్రతుకు వనమే దా
వానల మయ్యేదెరుగక-
నా కీరితి జీవిని మిం
గాలని నాలో దూరెను

మానవమృగ మెవడో తన
ప్రాణమె పోయేదెరుగక-
మూర్ఖాంధులు నన్ను బ్రాడు
ముక్కని, గోడని ఎంచిరి
విజయ రూపినౌ మానవ
గజరాజునటంచెరుగక-
అమలసత్యమే రక్త
మ్మై ప్రవహిస్తుంది నాలొ
వీరత్వము గాండీవము
నారుదైన నానాడులు
సౌందర్యము నాచూపుల
యందు వాసమై యున్నది
అభ్యుదయం నాస్ఫుటమే
ధాకృతిగొని అవతరించె
ప్రకృతిలోన నేను నాలో
ప్రకృతి లీనమై యున్నది
నా ఓటమి ఈ జగద్వి
నాశముకు సంకేతం
నా వికాసమున లోకం
నాకమ్మౌతుంది నిజం
ఎందుకు ఈ వృథావ్యధా
ఎలక మూకలార
మందరమును నేను వైర
మెందుకులే - క్షమించితిని.



సమీక్ష :

# మహబూబునగరంజిల్లా హిందీప్రచార సమ్మేళనం

అది దుందుభీ నదీతీరం. రఘుపతిపేట గ్రామం. మహబూబు నగరం జిల్లాలోని చరిత్ర ప్రసిద్ధమైన స్థలం. జిల్లా ద్వితీయ హిందీ ప్రచార సమ్మేళనాన్ని జనవరి 10, 11 తేదీలలో ఆ గ్రామంలో జరిపించడానికి నిర్ణయించబడింది. కల్వకుర్తి తాలూకాలోని ప్రముఖులతో ఆహ్వానసంఘం ఏర్పాటు చేయబడింది. సురభి రామేశ్వరశాస్త్రిగారు అధ్యక్షులు. శ్రీ ప్రతాపరెడ్డి, ప్రహ్లాద హనుమచ్ఛర్మగారలూ కార్యదర్శులు. రఘుపతిపేట కొంచెం మారుమూలన ఉన్నగ్రామం. అది తాలూకా ప్రధాన నగరం. కల్వకుర్తికి 12 మైళ్ళ దూరంలో ఉన్నది. పక్కా రోడ్డు లేదు. గ్రామస్థులు ఉత్సాహంగా రోడ్డు బాగుచేసుకున్నారు. అతిథులకార్లు రావడానికి అనువుగా మార్గం బాగుపడింది. రెండురోజులు సమావేశాలు జరిగినవి. ఊరుబయట రఘుపతి పేటలో ఒక హిందీ నగరాన్ని నిర్మాణం చేశారు. అమరాబాదునుండి వెదుళ్ళనూ, మహబూబునగరంనుండి విద్యుద్దీపాల యంత్రాలను, జడచర్లనుండి తడికెలనూ, స్థానికంగా తదితర సాధనాలనూ ఆహ్వానసంఘంవారు సమకూర్చుకొన్నారు. ఒక ప్రదర్శనశాలనుగూడా నిర్మాణం చేశారు. విశాలమైన సభామంటపం, విశాలమైన పందిరి మొదలగు వానితో కన్నుల పండువుగా నగరనిర్మాణం జరిగింది. రెండువందలమంది బాలభటులు రకరకాల దుస్తులతో, సభానిర్వహణకు ఎంతగానో తోడ్పడ్డారు. ప్రజల ఉత్సాహం కట్టలు తెగి ప్రవహించిన ట్లనిపించింది. తమ నాయకుల గౌరవార్థం 16 మైళ్ళ దూరంనుండి గ్రామగ్రామం దగ్గరా కమాన్లు నిర్మింపబడ్డవి. ఆయా కమాన్ల దగ్గర ఆయా గ్రామాలలోని స్త్రీలూ, పురుషులూ, హారతులతో, పూలమాలలతో నిలబడ్డారు. కొన్ని అవాంతర పరిస్థితులవలన నాయకులరాక ఆలస్యమయింది. అయినా ప్రజలు నిరుత్సాహపడక తమఉత్సాహాన్ని నాయకులయెడ తమకుగల అనురాగాన్నీ వెలిబుచ్చారు.

సమ్మేళనాధ్యక్షులు హైదరాబాదు ప్రదేశకాంగ్రెసు అధ్యక్షులు శ్రీ జె. వి. నరసింగరావుగారు. ప్రారంభకులు హైదరాబాదు ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణారావుగారు. శరీరం అస్వస్థతగా ఉండడంవలన రామకృష్ణారావుగారు సమ్మేళనానికి రాలేక పోయినారు. హైదరాబాదు ఆర్థిక శాఖా

మాత్యులు శ్రీ వినాయకరావు విద్యాలంకార్‌గారు సమ్మేళనాన్ని ప్రారంభించారు. ఉపమంత్రి శ్రీ పల్లెర్ల హనుమంతరావుగారు ప్రదర్శనాన్ని ప్రారంభించారు. దాదాపు ఎనిమిది వేలమంది ప్రజలు సభలలో పాల్గొన్నారు.

10 వ తేదీ సాయంత్రం శ్రీ రామేశ్వరశాస్త్రిగారు ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసం చేశారు. సురభి శర్మగారు జిల్లా హిందీప్రచార సంఘ కార్యదర్శి నివేదికను చదివి వినిపించారు. జయజయధ్వానాలమధ్య వినాయకరావు విద్యాలంకారుగారు భారతదేశ సమైక్యతకు హిందీ ఏవిధంగా ఉపయోగపడుతుందో వివరించారు. సమ్మేళనాన్ని ప్రారంభించారు. సమ్మేళనాధ్యక్షులు శ్రీ జె. వి. నరసింగరావుగారు భారతదేశంలోని భాషలన్నీ గొప్ప చరిత్ర గలవన్నారు. అన్ని ప్రాంతీయ భాషలూ సమానంగా అభివృద్ధి పొందవలెనన్నారు. అన్ని ప్రాంతాలనూ సమన్వయపరచడానికి జాతిపిత గాంధీజీ హిందీని జాతీయభాషగా గుర్తించారనీ ,ఆ భాషాప్రచారానికి దక్షిణదేశంలో దక్షిణభారత హిందీ ప్రచారసభను స్థాపించారనీ, రాజ్యాంగచట్టంలో ఈనాడు హిందీ అధికార భాషగా స్వీకరించబడిందనీ అన్నారు. ప్రాంతీయ భాషలనూ, హిందీనీ అభివృద్ధి పరచుకుంటూ భారతీయ జనసామాన్యం పురోగమించగలదని తమ విశ్వాసాన్ని ప్రకటించారు. ఉర్దూ ఇదివరలో వ్యాప్తిలో ఉండడంవలన హైదరాబాదులో ఉండేవారికి హిందీ నేర్చుకొనడం కష్టంగాదని తమ అభిప్రాయాన్ని వెల్లడించారు.

జిల్లా కలెక్టర్ శ్రీనివాసన్‌గారు జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ అచ్యుత రెడ్డిగారు తమ శుభాశీస్సులను అందజేస్తూ ఉపన్యసించారు.

శ్రీ పల్లెర్ల హనుమంతరావుగారు ప్రదర్శనాన్ని ప్రారంభించారు. ప్రథమ సమ్మేళన సందర్భంలోగూడా జడచర్లలో శ్రీ హనుమంతరావుగారే ప్రదర్శనాన్ని ప్రారంభించారు. ఈ సంవత్సరంగూడా వారే ఆపని చేయబోతున్నారని శ్రీ నరసింగరావుగారు చమత్కరించారు. ప్రదర్శనంలో ఖాదీ, హిందీ, గ్రామోద్యోగ శాఖలవారు, చేనేతసంఘం, పౌరసమాచారశాఖవారు అనేకులు పాల్గొన్నారు.

జాతీయగీతంతో మొదటి సమావేశం పూర్తి అయింది.

* * *

రాత్రి 10 గంటలకు కర్నూలు నాట్యమండలివారు 'మనవూరు' అనే నాటకాన్ని ప్రదర్శించారు.

దాదాపు వందమంది హరిజనసోదరులు కనకతప్పెట్లతో, కొమ్ము బూరలతో సమ్మేళనంలో పాల్గొని తమ వాద్య నైపుణ్యాన్ని ప్రదర్శించి దర్శకులకు మహదానందాన్ని సమకూర్చారు.

*　　*　　*

రెండవరోజు ఉదయం సాహితీ సమ్మేళనం. కర్ణాటక సాహిత్య పరిషదధ్యక్షులు శ్రీ మాన్వి నరసింగరావుగారు అధ్యక్షులు. శ్రీ రాజలింగంగారు ప్రారంభకులు. శ్రీ రాజలింగంగారు దక్షిణదేశంలోను, హైదరాబాదులోను రాజకీయ చైతన్యాన్ని వ్యాపింపజేయడానికి దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఏవిధంగా కృషిచేసిందీ వివరించారు. నిర్మాణ కార్యక్రమ సంస్థలలో హిందీ ప్రచారసభ, దాని హైదరాబాదుశాఖ అయిన హిందీ ప్రచారసంఘము చేయుచున్న కృషిని ప్రశంసించారు. ఇంతటి కాలంలో - ఈ గ్రామంలో ఇంతవైభవంగా జరుగుతున్న హిందీ సమ్మేళనాన్ని చూస్తూ ఉంటే గాంధీజీ స్థాపించిన ఈ సంస్థ తన లక్ష్యాన్ని సంపూర్ణంగా గుర్తించి ఉన్నదనే విషయం స్పష్టంగా గోచరిస్తున్నదన్నారు. ఇదే సందర్భంలో హైదరాబాదు హిందీ ప్రచారసంఘ కార్యదర్శి శ్రీ అంజనేయశర్మగారు గాంధీజీ ఖమ్మంమెట్టు వచ్చినప్పుడు శ్రీ రాజలింగంగారూ, వారి అనుయాయులూ కొంతనిధిని గాంధీజీకి సమర్పించారనీ, ఆ నిధితో హైదరాబాదులో పునః పనిని ప్రారంభించవలసినదని గాంధీజీ దక్షిణభారత హిందీ ప్రచారసభను ఆదేశించారనీ, దక్షిణభారత హిందీ ప్రచారసభ హైదరాబాదు శాఖను హైదరాబాదులో పునః స్థాపించడంలో శ్రీ రాజలింగంగారి సహకారం ఎక్కువగా ఉన్నదనీ పూర్వకథను జ్ఞప్తికి తెచ్చి శ్రీరాజలింగంగారికి ధన్యవాదాలను సమర్పించారు.

శ్రీ వారణాసి రామమూర్తిగారు హిందీలోని వీరగాథాకాల, భక్తికాల సాహిత్యపరిచయం గావించారు. శ్రీ కపిల కాశీపతిగారు తెలుగు సాహిత్య విశిష్టతను తెలియజేస్తూ నన్నయభట్టునుండి నారాయణరెడ్డివరకు తెలుగులో కలిగిన వివిధ ప్రవృత్తులను వివరించారు. శ్రీ ఆర్. యం. జోషీగారు మరాఠీ సాహిత్యాన్నిగురించీ, అబ్దుల్ ఖాదర్ సర్వరీగారు ఉర్దూసాహిత్యాన్ని గురించీ వివరంగా ఉపన్యసించారు.

సుప్రసిద్ధ తెలంగాణా చిత్రకారులు శ్రీ రాజయ్యగారికి జిల్లా హిందీ ప్రచారసంఘంవారు నూతన వస్త్రాలతో ఘనమైన సన్మానం గావించారు. శ్రీ రాజయ్యగారు ప్రదర్శనంలో పాల్గొని తమ చిత్రాలను ప్రదర్శించారు.

ఆరోజు సాయంత్రం 4 గంటలకు జిల్లా సంఘాధ్యక్షులు శ్రీ కె. సిద్ది లింగప్పగారి అధ్యక్షతను విషయనిర్ణయసభ జరిగింది. జిల్లాలోని ప్రముఖ కార్యకర్తలు చాలామంది ఆ సమావేశంలో పాల్గొన్నారు.

సాయంత్రం గం. 6 లకు సమ్మేళనం తిరిగి ప్రారంభమయింది. హిందీ కమీషనుకు స్వాగతం తెలియజేస్తూ, హైదరాబాదు రాష్ట్రంలోని ప్రాంతీయ భాషా సాహిత్యాన్ని, ఆయా భాషా ప్రాంతాలలోని ప్రత్యేకతలనూ హిందీ ద్వారా యావద్భారతదేశానికి అందింపజేయవలసిందిగా హైదరాబాదు రేడియో కేంద్రం అధికారులను కోరుతూనూ, కేంద్రప్రభుత్వ పక్షమున ప్రత్యేక హిందీ కార్యాలయమును ప్రారంభించవలసిందిగా కేంద్రప్రభుత్వమును ప్రార్థిస్తూనూ, హైదరాబాదులోని హిందీ ఉపాధ్యాయుల యోగ్యతను పెంచడానికి అనువుగా త్రైమాసిక హిందీ శిక్షణ శిబిరములను ప్రారంభించి నందులకు హైదరాబాదు ప్రభుత్వమువారిని అభినందిస్తూనూ తీర్మానాలు చేయబడ్డవి.

1956 సంవత్సరానికి శ్రీ బి. యస్. రావుగారు అధ్యక్షులుగ, శ్రీ జగన్మోహనరెడ్డి, కొత్త కేశవులుగారలు ఉపాధ్యక్షులుగ, శ్రీ శ్రీనివాసరావు, బి. రంగయ్యగారలు కార్యదర్శులుగా జిల్లాసంఘ కార్యవర్గం ఎన్నుకోనబడింది. శ్రీ పల్లెర్లహనుమంతరావు, యం. రామిరెడ్డి M. L. A., పుల్లారెడ్డి M.L.A. మొదలగువారు కార్యవర్గ సభ్యులుగా ఎన్నికైరి.

రాత్రి గం. 8 లకు కవిసమ్మేళనం జరిగింది. శ్రీ బి. రామరాజుగారు సమ్మేళనాన్ని ప్రారంభిస్తూ జానపద వాఙ్మయ ప్రాముఖ్యతను విపులీకరించారు. శ్రీ నారాయణరెడ్డిగారు కవిసమ్మేళనానికి అధ్యక్షత వహించారు. జిల్లాలోని పలువురు కవులు సమ్మేళనంలో పాల్గొన్నారు.

రాత్రి స్థానిక పాఠశాల విద్యార్థులు, విద్యార్థినులు బతకమ్మ నృత్యాన్ని ప్రదర్శించారు. మూడు ఏకాంక నాటికలు ప్రదర్శింపబడ్డవి.

జనగణమన గీతంతో సమ్మేళనం విజయవంతంగా ముగిసింది.



# ఆహ్వాన సంఘాధ్యక్షుని ఉపన్యాసము

—శ్రీ సురభి రామేశ్వరశాస్త్రి

సభాసదులారా!

తీరుతీయములైన భాషా వాహినులకు, పండిన పైరులతో బంగారు గాజవోసెడి వరి మళ్ళకు, సంస్కృతాంధ్రములయందురాటుదేలిన కలములకు, చరిత్రకందని నాటినుండి శత్రు భయంకర వీర హుంకారములకు, మైనపుముద్దలవలె మలచబడిన శిల్పములకు, గడిదేరిన శాస్త్రవాదములకు, చిత్రవిచిత్రములైన వివిధ పరిశ్రమలకు, ప్రతియుగమందున రాజ్యాంగమును రచించు రాజకీయ వేత్తలకు, ఐహిక సర్వస్వమును గడ్డిపోచగానెంచి చెరసాలలకురుకు దేశభక్తులకు, ఆశ్రయించు యాచక జనంబుల మనోరథంబు లీదేర్చు వదాన్యులకు, శ్రౌత స్మార్తనిష్ఠులైన వేదవేదాంగ వేత్తలకు జన్మభూమి మా మహబూబునగర మండలము.

పావన దుందుభీనది ఉత్తరపు ఒడ్డున సర్వకళల కాలవాలమై ఒకనాటి తన మహోన్నత చరిత్రను చాటుచు, అడుగడుగునకు చరిత్ర సంస్కృతి నాగరికతలను వెలిబుచ్చుచు, భిన్నభిన్న సంప్రదాయములతో ఆనాటి రాజన్యుల నిత్యనైమిత్తిక వ్యవహారములను తెలుపుచు అలరారెడిది మా కల్వకుర్తిసీమ.

ఇచ్చట మా స్థానిక చరిత్ర తెలియజేయుట సమంజసమని నాతలంపు. మహబూబునగరం జిల్లా హిందీప్రచారసంఘ మహాసభను విజయవంతముగా నడుపుటకు ఏర్పాటుచేయబడిన ఈ సమావేశ స్థలము (రఘుపతిపేట) మహబూబునగర మండలములోని మూడు సీమలకు కూడలి స్థలము, అవే పడమర నాగరకందనూలు, దక్షిణమున అచ్చమపేట, ఉత్తరమున మన సమావేశ స్థలమే హద్దుగాగల కల్వకుర్తి, ఇచటికి పడమర వర్ధమానపురము, తూర్పున చూతఘోష పురము (మామిళ్ళపల్లి) చారిత్రక స్థలములు- ఈ పైరెంటికి మధ్య భాగమున నున్నదే మా రఘుపతిపేట. ఇటకు కనుచూపు మేరన దుందుభీనదీ దక్షిణతీరమున జైన, శైవ, వైష్ణవయుగ చిహ్నములతో ఏనాటి చరిత్రనో రుజువుచేయుచున్న చాళుక్య శిల్పములతో ప్రకాశించుచున్న ఆ చిన్ని కొండపైన నేడు రామగిరియని ప్రసిద్ధి పొందిన దేవాలయ మొకటి ఉన్నది, ఆ ఆలయ పశ్చిమ భూభాగమున తన సర్వ భాగ్యములను భూగర్భమున వెదకుచు నామమాత్రావశిష్టమై యున్న భూమియే సురభి పట్టణ స్థలము. ఇది సుమారు ఆరుమైళ్ళ పొడవుగల పట్టణమని ప్రతీతి. పశ్చిమ చాళుక్యుల చక్రవర్తియైన తైలప మహారాజునకు సామంతుడై, భువనగిరి దక్షిణముగా (30) ముప్పది గవ్యూతుల దూరము నందలి వర్ధమానమును రాజధానిగా జేసికొని భీమచోడుడు ఈ పట్టణ ప్రాంతమును పరిపాలించెనని శాసనగాథ. చూతఘోష నృసింహస్వామి అంగరంగ భోగ కైంకర్యాదులకై చోళభీముడు అతని తమ్ముడు గోకర్ణుడు వేయించిన దాన శాసనము ప్రత్య

తము గట్టుతుమ్మెను యను (అచ్చంపేట తాలూకా) గ్రామమునందున్నది. శిలాతామ్ర శాసనములు ఏవియులేని మా సురభిపట్టణము వర్ధమాన చూతఘోష మధ్య ప్రదేశము కావున వర్ధమాన చోళులదని నిర్ధారింప వీలయ్యేది. కాలవశమున భీమరాజు చేసిన దుర్మార్గమును సహింపలేక మొదటి కాకతీయ ప్రతాపరుద్రదేవుని ఆజ్ఞతో భువనగిరి పరిపాలకుడగు గోన బుద్ధారెడ్డి వర్ధమానముపై దండెత్తి వర్ధమాన పట్టణమును ధ్వంసముచేసి, భీముని వెడలగొట్టి రుద్రదేవుని ఆజ్ఞానుసారముగా వర్ధమానముతోసహా ఈ ప్రాంతమును పరిపాలించెనని శాసనచరిత్ర కలదు.

నేటికికూడ ఈ పట్టణస్థల భూములను శిస్తుచేయు మా కాపుసోదరులకు దున్నునప్పుడు గృహోపకరణములు అచ్చటచ్చట దొరుకుచుండును. ఆనాటి నాణెములు కూడ దొరికిన ప్రతీతి కలదు. మా దౌర్భాగ్య వశమున మా పట్టణ చరిత్ర చారిత్రికుల చేతికి రాలేదు. ఇట్టి చారిత్రక ధార్మిక స్థలముననే ఈ నాటి ఈ పెద్దలందరి సమావేశము.

సురభివారి వంశావళిలో దేవరకొండ నుండియే వారి చరిత్ర కలదు. కాని దేవరకొండకు వారు ఈ సురభినుండియే వెడలిరని ఇట మా పూర్వులు చెప్పు గాథలు కలవు. వారితో వెడలిన కొన్ని జాతులవారు నేటికి దేవరకొండ సీమలో స్థిరనివాసులై యుండి ఉన్నారు. వారి పూర్వనివాసము యీ సురభియని చెప్పుట గమనింప దగినదని మనవి.

చూతఘోషమునకు ముందుకు పోయినచో శ్రీశైల ఉత్తర ద్వారము ఉమామహేశ్వరమూ- అట కాకతీయ శిల్పమూ, కాకతీయ శాసనములు చరిత్ర కెక్కినవే. పడమర పశ్చిమ చాళుక్యుల రాజధాని గంగాపురము పొలిమేర మాకు మూడుమైళ్ళ వరకని చెప్పుట కలదు. మా ప్రాంతములో సైన్యములు నడిచిన బాటలు దండుబాటలని జనులచే ఇప్పటికిని వ్యవహరింపబడు చున్నవి. దోవలో దుందుభీనదీ ప్రాంతమున అటునిటు శివాలయములు, ధనుష్పాణులు, ఆశ్విక విగ్రహములు నేటికిని సాక్షాత్కరించును. వీరరుద్రమదేవి రాజ్యమును చక్కగా సాగించిన గోనగన్నారెడ్డి మా పొరుగునున్న వర్ధమానమువాడే. గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణ కర్తయని ప్రతీతి, అటనట మా సీమలో గోన దేవాలయములని, గోన బావులని వాడుక గలదు. ఇది మా స్థానిక చరిత్ర.

మా సమీపముననున్న అచ్చమపేట సీమలోని అమరావతివాడే (అమరాబాదు) శ్రీమద్భాగవత విశిష్టాద్వైత వ్యాఖ్యానకర్త వీరరాఘవాచార్యులు, తెలుగు ఛందో గ్రంథకర్త అప్పకవి మా కలవకుర్తి సీమవాడు. ప్రకృతము యావద్భారతమున వ్యవహరించుచున్న విస్సన్న చెప్పినదే వేదము అను సామెతకు మూలకారణమైన విస్సన్నవారు మా సురభి నివాసులు. పుంభావ భారతియగు అచ్యుత యతీంద్రులకు మా స్థలము రంగస్థలము. మధురవాణీ విలాసకర్త వీరరాఘవకవి మా ప్రాంతముననున్న వట్టెమువాడు, ప్రముఖ

గేయకర్త పండితకవియగు నారాయణాధ్వరి కలవకుర్తి స్థానికమున నున్నవాడు. వనపర్తి గద్వాల జటప్రోలు మొదలగు సంస్థానములకు ఆస్థాన పాండిత్యమునకై పిలుపింపబడు పండితులెందరో మా భూమివారు. సమస్తదేశములు సంచరించిన అచ్యుతస్వామికి మా ప్రాంత పండితులయందుగల గౌరవాభిమానములే మా పాండిత్యమునకు గొప్ప లక్షణము. తాంత్రిక విద్యావేత్త బ్రహ్మచారిబావ యీ రామగిరియందుండి యెన్నియో యజ్ఞ దీక్షలను జరిపి తన తంత్ర విద్యా ప్రభావముచేత పదార్థములను సృజించి కడతేర్చెనని వినికిడి. ఇది మా విద్వత్సంపద.

రఘుపతిపేట కాగితము పరిశ్రమ, ఆమనగల్లు జరీపరిశ్రమ, బోయనపల్లి లోహ పరిశ్రమ- యింకను ఈ ప్రాంత గ్రామ గ్రామములయందు అనేక పరిశ్రమలు విలసిల్లినవి. పైరుపంటలతో కళకళలాడుచు, ఈ వేదికకు కుడిప్రక్కన వరిమళ్ళలోనుండి తల లాడించుచున్న వరి పైరులు మా ఐహిక సర్వసంపత్తులు.

రాజభాషయైన హిందీ భాషను వ్యాప్తిలోకి తేవలసియున్నది. మనదేశములోని పెద్దలగు నాయకులు కూలంకషముగా చర్చించి రాజభాష స్థానమున హిందీ భాషను అధిరోహింప జేసినారు. ఈ సందర్భమున రెండు మూడు విషయములను దృష్టియందుంచుకొనవలసి యున్నది. స్వాతంత్ర్యము లభించిన తర్వాత ప్రజలకు తమ భాష యెడల, తమ దేశము నెడల భక్తిప్రపత్తులు ఆదరాభిమానములు పెరుగుచున్నవి. మహమ్మదీయ ప్రభుత్వము రోజులలో హైదరాబాదు రాష్ట్రములోని ప్రాంతీయ భాషలు అణగద్రొక్కబడి యుండెను. ఇపుడిపుడే ప్రజలలో నవచైతన్యము విలసిల్లి ప్రాంతీయ భాషల అభివృద్ధికి కృషి ప్రారంభ మైనది. హిందీయే మాతృభాషగా గలిగిన కొంతమంది హిందీ వాదులు చేయుచున్న అల జడిని గమనింపగా పూర్వము ఉర్దూ చేసిన పనిని హిందీ గూడా చేయగలదను అనుమానము ప్రజలలో వ్యాపించు చున్నది. ప్రాంతీయ భాషల అభివృద్ధికి విఘ్నము కలుగకుండ హిందీ భాష వ్యాప్తికి తోడ్పడవలసియున్నది. ఈ విషయములో ముఖ్యముగా దక్షిణ భారత హిందీ ప్రచార సభవారు ప్రాంతీయ భాషలను సైతము తమ పరీక్షా పాఠ్యప్రణాళికలో నిర్బంధ విష యములుగా ప్రవేశపెట్టుట సంతోషకరమైన విషయము. బహుభాషలు బహుప్రాంతములు కలిగిన మన భారతదేశములో వ్యష్టి సమష్టి రెండింటియొక్క సమన్వయమునకు అనువగు ఉపాయములను అన్వేషించవలసి యున్నది. ఏకముగానో రెండుగానో చీలనున్న మన తెలుగుదేశమున తెలుగు సంస్కృతి వికాసమునకు తోడ్పడు ప్రణాళికలను రూపొందించవలసి యున్నది. దేశచరిత్రలో ఎంతో ప్రాముఖ్యత నొందవలసియున్న ఈ సంధి సమయమున సమావేశపరచబడిన ఈ సమ్మేళనమునకు ప్రత్యేక ప్రాముఖ్యత కలదని భావించుచున్నాను.

ఈ రెండు దినములు యిచ్చట జరుగు హిందీ ప్రచార సమ్మేళనము విజయవంతముగా నడుప నేతెంచిన మీ కందరకు ప్రేమ హారములనర్పించి మా ఆహ్వాన సంఘపక్షమున

హృదయ పూర్వక స్వాగతము పలుకుచున్నాను. కళాసక్తిలో పూర్వము ఆంధ్ర మంత్రులను జ్ఞప్తికి తెచ్చు రాజకీయవేత్తలు, కవులు, పండితులు, అతిమేధావులైన హైదరాబాదు ముఖ్య మంత్రులు డాక్టరు బూర్గుల రామకృష్ణారావుగారు ఈ మహాసభలను తమ అమృత హస్తము లతో ప్రారంభించవలసి యుండెను. కాని అస్వస్థతవలన వారు రాలేకపోయిరి. ఆర్థిక శాఖా మాత్యులు శ్రీ వినాయకరావుగారు దయచేసినారు. వారికి మా స్వాగతము. మా ప్రాంతీయుల మహాభాగ్యమున, అధ్యక్ష పీఠము నలంకరించి ఈ మహాసభను సుగమముగా యశోవంత ముగా నడుపుటకు హైదరాబాదు ప్రముఖనాయకులగు హైదరాబాదు ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ జె. వి. నర్సింగరావుగారు పూనుకొన్నందుకు మే మెల్లరము నెంతో ఆనందించు చున్నాము.

ఈ పర్వదినమున హైదరాబాదు ఉపమంత్రులు ఎం. యస్. రాజలింగం శ్రీ పల్లెర్ల హనుమంతరావుగారలు ప్రదర్శన సాహిత్య సమావేశములను ప్రారంభించుటకు దయచేసినందులకు మే మెంతో సంతోష పడుచున్నాము. తమ అమూల్యసందేశముల నిచ్చుటకై కర్నాటక సాహిత్య పరిషదధ్యక్షులు శ్రీ మాన్వి నరసింగరావుగారు దయచేసినారు. కపిల కాశీపతి, శ్రీ వారణాసి రామమూర్తి, శ్రీ ఆర్. యం. జోషీగారు, అబ్దుల్ ఖాదర్ సర్వరీ, శ్రీ నారాయణరెడ్డి, శ్రీ బి. రామరాజు, శ్రీ పల్లా దుర్గయ్య, శ్రీ బి. యస్. రావు గారలు ఉపన్యాసకులుగా అధ్యక్షులుగా వ్యవహర్తలుగా దయచేయుట మా పూర్వ పుణ్యము.

ఇంకను సుప్రసిద్ధ విద్వాంసులు, కళాకోవిదులు, సాహిత్యస్రష్టలు, రాజకీయవేత్తలు, దేశభక్తులు దయచేయుట పరమానందకరము. పంచభాషా సంగమము మారుమూలన నొదిగి యున్న మా రఘుపతిపేటలో జరుగుట మా భవిష్యత్తుకు యెంతయో సదవకాశము కలిగించు చున్నది.

బాపూజీ ఆదేశానుసారము మేము దక్షిణ భారత హిందీ భాష గంగా స్నానపునీతుల మగుచున్నాము. సారస్వతసేవ చేయలేని మావంటివారలకు తమ అందరిసేవచేయు యీ మహాభాగ్యమును కలిపించిన హైదరాబాదు హిందీ ప్రచారసంఘ కార్యదర్శి శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారికి, హిందీ కార్యకర్తలకు మే మెంతయో కృతజ్ఞులము. ఈసమ్మేళనముకు ప్రేమతో దయచేసిన తాలూకా ప్రముఖోద్యోగులకు, మరచిన తదితర గౌరవనీయులకు, ప్రాంతీయ సోదరులకు మా ఆహ్వాన సంఘము పక్షమున స్వాగతము.



వ్యాసము :

# తమిళ సాహిత్యము

—శ్రీ యం. సుబ్రహ్మణ్యం

తమిళం ద్రావిడ పరివారానికిచెందిన ప్రముఖభాష. ప్రపంచంలోని అతిపురాతన మైన భాషలలో తమిళం ఒకటి. తమిళభాషలో మొదటి గ్రంథం ఎప్పుడు రచించ బడ్డదో చెప్పడం చాలా కష్టం. ఇంతవరకు లభించిన ప్రమాణాలనుబట్టి చూస్తే క్రీస్తు శకానికి పూర్వమే ఈ భాష సుసంస్కృతరూపంలో ఉన్నట్లూ, ఈ భాషలో అనేకమైన కృతులు రచించ బడ్డట్లూ తెలుస్తున్నది. భారతీయ భాషలలో సంస్కృత భాషసహాయం లేకుండా భావవ్యక్తీకరణ చేయగలిగిన భాష తమిళం ఒక్కటేనని నిస్సంశయంగా చెప్పవచ్చును. గడచిన కొన్ని శతాబ్దములనుండి సంస్కృతభాష ప్రభావం తమిళంమీద గూడా పడినా ఈ నాటికీ మిగతా ద్రావిడ భాషలలోకంటే సంస్కృత శబ్దాలు తమిళంలో తక్కువగా ఉపయోగింపబడుతున్నవి. తమిళ సాహిత్యాన్ని గురించి ఆలోచించడానికి పూర్వం ఆ ప్రాంతమూ, తమిళ లిపీ మొదలగు వానిని గురించి తెలుసుకొనడం అవసరం.

ఈనాటి తమిళప్రదేశం విస్తీర్ణం దాదాపు ఏభైవేల చదరపు మైళ్లు. తమిళం మాట్లాడే జనసంఖ్య సుమారు 3 కోట్లు. కొంతమంది విద్వాంసుల అభిప్రాయం ప్రకారం తమిళప్రాంతం క్రీస్తుకు పూర్వం జావానుండి ఆఫ్రికావరకు వ్యాపించి ఉండేది. దానినే "లెమోరియా" అని అనేవారు. ఆ ప్రదేశమంతా జలమగ్న మైపోయి ఒక్క లంక మాత్రం మిగిలింది. అదిగాక మొహంజదారో గుహలలో ద్రావిడజాతి చిహ్నాలు దొరికిన సంగతి అందరికీ తెలిసినదే.

నాగరీ లిపికివలె తమిళ లిపికి గూడా బ్రాహ్మీ లిపియే మాతృలిపి అని కొంత మంది అభిప్రాయపడుతున్నారు. కాని చాలమంది ఆ అభిప్రాయంతో ఏకీభవించడం లేదు. తమిళ లిపికి "వట్టెళుత్తు" అనగా గుండ్రని లిపి అని పేరు. తమిళంలో 12 అచ్చులూ, 18 హల్లులూ మాత్రమే ఉన్నవి. తమిళంలో వర్గ తృతీయాక్షరాలూ మహాప్రాణాక్షరాలూ లేవు. ఉదాహరణకు క వర్గంనుండి ప వర్గం వరకు కేవలం వర్గ ప్రథమ చతుర్థాక్షరాలు మాత్రం పది ఉన్నవి. య ర ల వ నాలుగు అక్షరా లున్నవి. ఇవిగాక తమిళంలో ప్రత్యేకంగా ఉపయోగింపబడే ఇంకొక నాలుగక్షరా లున్నవి. ఴ (ZHA) ళ Lha. ఱ Rra ఩ (Nna) వీనిలో మొదటి ఴ తమిళ భాషకు ప్రాణంతో సమానం,

సంస్కృత ప్రభావంవలన చాలా సంస్కృత శబ్దాలు అరవంలో కలుపుకొన బడ్డవి. మహాప్రాణాక్షరాలు లేకపోవడంవలన ఆ సంస్కృత శబ్దాలను చదవడం చాలా కష్టమైపోయింది. అందువలన గ్రంథ లిపి ప్రచారంలోనికి వచ్చింది. ఈ లిపి నాగరి లిపికి సమీపమైనదే. కాని సాహిత్య క్షేత్రంలో ఈ లిపి నడవలేదు.

క్రీస్తు శకానికి 5, 6 శతాబ్దాలకు పూర్వమే తమిళ భాషలో ఉత్తమ రచనలు జరిగినట్లు ఆధారాలు దొరుకుతున్నవి. ఆనాటి పండితులగు రాజులు సాహిత్య నిర్మాణానికి బాగా దోహదం చేశారు. ఆరోజులలో సాహిత్య కృషికిగాను కొన్ని పరిషత్తులను నిర్మాణం చేశారు. ఆ పరిషత్తులకు సంఘాలని పేరు. ఇటువంటి సంఘాలు ఒకటి తరువాత ఇంకొకటిగా మూడు స్థాపింప బడ్డవి. ఆ సంఘాల సభ్యులు ఉత్తమ కృతులను రచించి అద్వితీయ సాహిత్య సేవనుచేశారు. మొదటి రెండు సంఘాలనాటి పుస్తకాలు లభించడం లేదు. మూడో సంఘంనాటి రచనలే కొన్ని లభించినవి. ఈ సంఘాలను ఆధారంగా చేసుకొని కాలవిభాగంచేసి తమిళ సాహిత్యాన్ని వివరించే ప్రయత్నం చేస్తాను.

## కాలవిభాగం

సౌకర్యం కొరకు తమిళసాహిత్య చరిత్రను ఏడు కాలాలుగా విభజించవచ్చును. (1) సంఘపూర్వకాలం, (2) సంఘకాలం, (3) సంఘోత్తరకాలం, (4) భక్తికాలం, (5) కంబనకాలం, (6) మధ్యకాలం, (7) ఆధునికకాలం.

## సంఘపూర్వకాలం

సంఘాలు మూడు స్థాపించబడ్డవని పైన మనవిచేసియే ఉన్నాను. మొదటి రెండు సంఘాలనాటి రచనలు లభించక పోవడంవల్లనూ, మూడవ సంఘంనాటి రచనలు లభించడంవల్లనూ సంఘమనగా మూడవసంఘమని అర్థం చెప్పుకొనవలసి ఉన్నది. సంఘపూర్వకాలమంటే మొదటి రెండు సంఘాలనాటి కాలమని అర్థమవుతున్నది. మొదటి సంఘాన్ని క్రీస్తుశకానికి కొన్ని వందలసంవత్సరాలకు పూర్వం కాయ్ చిన వళుతి అనేరాజు దక్షిణమథురలో స్థాపించాడని విద్వాంసుల అభిప్రాయం. ప్రథమసంఘంలో 548 మంది పండితులుండేవారనే విషయంగూడా నిర్ధారణ అయింది. వారిలో మొదటి వ్యాకరణం 'అగాత్తియం' రచించిన అగస్త్యుడు ప్రముఖుడుగా ఉండేవాడు. తరువాత రెండవసంఘ సమయంలో వ్రాయబడిన వ్యాకరణం "అగాత్తియం"ను ఆధారంగా చేసుకొనే లిఖింపబడింది.

దక్షిణ మధుర నీటిలో మునిగిపోయిన తరువాత కవాటపురం పాండ్యరాజధాని అయింది. అక్కడ రెండోసంఘం ఏర్పడింది. వాల్మీకిరామాయణము, కౌటిల్యుని అర్థశాస్త్రము, మహాభారతములలో కవాటపురం ప్రశంస కనపడుతున్నది.

తతో హేమమయం దివ్యం ముక్తామణి విభూషితం

యుక్తం కవాటం పాండ్యానాం గతా ద్రక్ష్యథవానరాః

కిష్కింధకాండ 41 సర్గ 17 శ్లోకము.

ఈసంఘంలో మొదట 51 మంది విద్వాంసులుండేవారు, వారిలో తొల్కాప్పియర్ ఒకడు. ఈయన తొల్కాప్పియం అనే వ్యాకరణ గ్రంథాన్ని 1278 సూత్రాలలో రచించాడు. తమిళ సాహిత్యంలో ఇంతవరకు లభించిన వానిలో ఆది గ్రంథం ఇదే. ఈయన అగస్త్యుని శిష్యుడని ప్రతీతి.

తొల్కాప్పియంలో అనేకమంది ప్రాచీన రచయితల పేర్లు ఉల్లేఖింపబడి ఉన్నవి. ఆ గ్రంథంలో ఆ నాటి సాంఘిక పరిస్థితులు కూడా వర్ణింపబడి ఉన్నవి. ఈ గ్రంథం మూడుభాగాలుగా ఉన్నది.

(1) ఎళుత్తాధికారమ్ (వర్ణవిచారణ). (2) శొల్లాధికారం (శబ్దవివరణ), (3) పొరుళాధికారం (అర్థవివరణ) ప్రతి అధ్యాయమూ ఎనిమిది తొమ్మిది ఉపవిభాగాలలో విభక్తమై ఉన్నది. ప్రతి విభాగంలోనూ వ్యాకరణనియమాలు సూత్ర రూపంలో పొందుపరచబడి ఉన్నవి. మొదటి భాగంలో అక్షర ఉపయోగ విధానము ధ్వనిభేదములు మొదలగునవి వివరించబడి ఉన్నవి. రెండవ విభాగంలో శబ్దాల వ్యుత్పత్తి ప్రకృతి ప్రత్యయాదులు వర్ణింపబడి ఉన్నవి. శబ్దాలు నాలుగు రకాలని స్థిరీకరించబడ్డది. (1) ఇయల్ శోల్ (అచ్చమైన తమిళశబ్దాలు), (2) తిరిశోల్ (తద్భవశబ్దాలు), (3) వడశోల్ (సంస్కృత శబ్దాలు), (4) తిశైశోల్ (అన్యదేశీయాలు). ఈ శ్రేణీవిభాజనంవలన తొల్కాప్పియర్ దూరదృష్టిగలవాడని బోధపడుతున్నది. ఆయన భాషకు నలువైపులా ఇనపగోడలను కట్టలేదు. వికాసశీలమైన భాషాస్వభావాన్ని గుర్తిస్తూ ఇతర భాషాపదాలనుసైతం స్వీకరించడానికి తగిన అవకాశాన్ని మొదటినుండి కలిగించి అట్టిపెట్టాడు, తమిళంలో ధ్వనినిబట్టిగాక శబ్దముల అర్థాన్నిబట్టి లింగం నిర్ణయించబడుతుంది. స్త్రీలింగం పుంలింగాలు దేవతలకు మనుష్యులకు మాత్రమే ఉపయోగింపబడుతవి. మిగతావన్నీ నపుంసకలింగ శబ్దాలే..

మూడవది పొరుళాధికారం. పొరుళ్ శబ్దానికి మూడు అర్థాలున్నవి. అర్థ, ధన, వస్తువులు ఆమూడు. ఈ అధ్యాయంలో వ్యాకరణ విషయాలతోబాటు ప్రకృతి, జీవితము మొదలగువానికి సంబంధించిన విషయాలుగూడా వర్ణింప బడ్డవి. సాహిత్యం

మూడు విభాగాలు చేయబడ్డది. (1) ఇయల్ (పాఠ్యసాహిత్యము), (2) ఇశై (గేయసాహిత్యము), (3) నాటకమ్ (నాటకసాహిత్యము). ఈ అధ్యాయంలో ఇయల్‌ను గురించి విపులంగా చర్చించ బడ్డది. ఛందశ్శాస్త్రము, పద్యములు, అలంకారములు అన్నీ ఇయల్‌లో చర్చించబడ్డవి. రసాలు ఎనిమిది అనీ, కవిత్వానికి రసమే ప్రాణంతో సమానమనీ నిర్ణయించ బడింది. శృంగారరసంలోని ఉపభేదాలన్నీ వివరించబడ్డవి.

క్రీస్తుశకానికి రెండు శతాబ్దాలకు పూర్వం హఠాత్తుగా సముద్రం పొంగడం వలన రెండవసంఘంగూడా అంతమై పోయింది. ఈ జలవిప్లవం కవాటపురాన్నీ తదితర ప్రాంతాలనూ జలమగ్నం చేసివేసింది. కవాటపురం సముద్రంలో మునిగి పోయింది. లంకలోని బౌద్ధ ఇతిహాసగ్రంథం రాజావళిలో ఈ వివరాలన్నీ వర్ణింప బడి ఉన్నవి. మూడవ సంఘానికి సంబంధించిన ఒక సభ్యుడు జలప్లావనంలో నెమ్మది నెమ్మదిగా నీటిలో మునిగిపోతూవున్న ఒక పర్వతాన్ని ఈ విధంగా వర్ణించాడు.

"సముద్రరాణి తరంగాలనే నూపురాలను ధరించి కల్లోలంచేస్తూ పర్వత శిఖరం మీద నృత్యంచేయ నారంభించింది. ఆ నృత్యవేగానికి అచలమైన పర్వతంగూడా కంపించి పోయింది."

తరువాత మూడవ సంఘం ప్రస్తుతమున్న మధురలలో క్రీస్తు పూర్వం నూట ఏభై సంవత్సరములకు ముందు స్థాపించబడింది. ఈ యుగం తమిళ సాహిత్యంలో స్వర్ణయుగమని చెప్పవచ్చును.

ఈ యుగంనాటి రచనలు గూడా చాలావరకు దొరకలేదు. కాని మహామహోపాధ్యాయ డాక్టరు స్వామినాథయ్యర్‌గారి విశేష ప్రయత్నంవలన కొన్ని కృతులు వెలుతురులోనికి తీసుకొని రాబడినవి. (1) ఎట్టుతోగై (2) పత్తుప్పాట్టు (3) పతినేని కీళకణక్కు. ఎట్టుతోగైకు అంతర్గతంగా ఎనిమిది సంగ్రహ గ్రంథాలున్నవి. (1) కలిత్తోగై (2) పరిపాడల్ (3) ఏంగూరునూరు (4) పదిట్రుపత్తు (5) అగనానూరు (6) పురనానూరు (7) నట్రిణై (8) కురుంతోగై. కలిత్తోగై ఇంగ్లీషు భాషలోని సానెట్ లాంటిది. పరిపాడల్ అనేది పెద్ద పెద్ద ఆడంబర యుక్తమైన పద్య సంగ్రహము, ఏంగూరునూరు రాజప్రశస్తి గీత సంగ్రహము. నట్రిణై, కురుంతోగై రెండూ ప్రేమగీత సంగ్రహాలు, పురనానూరులో 400 పద్యాలున్నవి. పురమ్ కావ్యమంటే బాహ్యజగత్తుకు సంబంధించిన కావ్యమనిపేరు. ఇవి ప్రేమగీతాలు కావు. అగనానూరులో అంతర్జగత్తుకు సంబంధించిన గీతాలున్నవి.

పత్తుప్పాట్టులో పది పెద్ద పెద్ద పొడుగైన కవితా సంగ్రహము లున్నవి. కొన్ని పద్యాలలో ఆరేసి వందల పంక్తులు గూడా ఉన్నవి. పత్తుప్పాట్టులోని పది కవితలలో తిరుమురు కాట్రుపడై ఒకటి. దీనిలో కార్తికేయుడున్న తీర్థములు వర్ణింపబడినవి. శైవులు ఈ గ్రంథాన్ని మత గ్రంథంగా భావిస్తున్నారు. మిగిలిన గ్రంథాలలో రాజుల ఔదార్యము, సాహిత్యప్రేమ, శాసన వ్యవస్థ, ప్రాకృతిక దృశ్యాదులు మొదలగునవి వర్ణించబడ్డవి. విరహకాతరలైన నాయికలు గూడా వర్ణింపబడ్డారు.

ఇక్కడ కలిత్తొగైలోనుండి ఒక గీతం భావార్థాన్ని పొందుపరుస్తున్నాము,

"ఓ కంకణాలు ధరించిన దానా! విను. నేను సఖులతోబాటు బొమ్మరిళ్లు కట్టుకుంటూ ఉంటే ప్రియుడు వాటిని పాడుచేసేవాడు. గట్టిగా బిగించిఉన్న నా జడను ప్రేమతో ఊడదీసి వేసేవాడు. ఆడుకొనే బంతి తీసుకొని పోయేవాడు. ఒకసారి నేను మా అమ్మదగ్గర కూర్చునిఉంటే మంచినీళ్లు కావలెనని అతడు మా యింటికి వచ్చాడు. వెళ్ళి బంగారు పాత్రతో మంచినీళ్లు యివ్వమని మా అమ్మ అన్నది. నేను ముగ్ధురాలనై లోపలికి వెళ్ళాను. అతడు నీళ్ల తాగడానికి నాతోగూడా లోపలికి వచ్చాడు. ఇద్దరం ఏకాంతంలో ఉన్నాము గదా! వెంటనే నా చెయ్యి పట్టుకున్నాడు. నావళ్లు కంపించింది. అమ్మా అని కేక పెట్టాను. మా అమ్మ లోపలికి వచ్చింది. మంచినీళ్లు త్రాగుతుంటే అతనికి ఎక్కిళ్లు వచ్చినవని మాఅమ్మతో అసత్యం చెప్పి అతణ్ణి రక్షించాను. క్రీగంటి చూపులతో అతడు నన్ను చూస్తూ చిరునవ్వు నవ్వుతూ వెళ్ళిపోయినాడు. అతనిని జ్ఞాపకం చేసుకోగానే ఓ చెలీ! నా మనస్సు వేదనాభరిత మవుతున్నది."

ఇటువంటి రసవత్తరములైన పదాలతో కలిత్తొగై నిండి ఉన్నది.

(3) పతినేణ కీళకణక్కు (నీతిసూక్తి గ్రంథము) గీతములు, వర్ణనాత్మక కవితలు తరువాత సూక్తులయుగం ఆరంభమవుతుంది. నిజానికి సంఘకాలంలో సూక్తుల ప్రాముఖ్యత బాగా పెరిగిపోయింది. వివిధ ధర్మములు దేశంలో వ్యాపించడం వలన నీతికి సంఘంలో ప్రాముఖ్యత ఏర్పడింది. ఆకాలం నాటికి దీర్ఘఛందస్సులు తగ్గిపోయి ద్విపద, చతుష్పద ఛందాలు వ్యాప్తిలోనికి వచ్చినవి. మొత్తం 18 నీతి గ్రంథాలు లిఖింపబడ్డవి. వానిలో ఆరు ప్రేమప్రధానాలు. మిగిలిన వాటిలో ఎక్కువ భాగం పురమ్ కావ్యాలు. వానిలో యుద్ధాది వర్ణనలూ, నైతికసూక్తులూ ఎక్కువగా ఉన్నవి. 18 వ సూక్తిగ్రంథం విశ్వవిఖ్యాతమైన తిరుక్కురళ్. దానినే తమిళవేదమని అంటారు. తిరువళ్లువర్ దాని రచయిత. ఇప్పటికి సుమారు రెండువేల సంవత్స

రాలకుపూర్వం తిరువళ్లువర్ జన్మించినట్లు కనపడుతున్నది. సంఘయుగం ఉత్త రార్థంలో జీవితసత్యాలను సాహిత్యం వదలివేసేరోజులలో తిరువళ్లువర్ తిరిగి ఆ సంబంధాన్ని పునరుద్ధరించి తమిళసాహిత్యంలో విశిష్టమయిన స్థానాన్ని సంపా దించుకొన్నాడు. ఒక ధనవంతుని కుమారునికి నీతిని బోధించుటకై తిరువళ్లువర్ సూక్తులు రచించాడని కొంతమంది అంటారు.

తిరుక్కురళ్ మూడు భాగాలుగా ఉన్నది. (1) అరత్తుప్పావ్ (ధర్మవిభా గము), (2) పోరుతుప్పావ్ (అర్థవిభాగము), (3) కామత్తుప్పావ్ (కామవిభాగము) మూడు పురుషార్థాలు రానేవచ్చినవి. నాలుగవ పురుషార్థం మోక్షం మొదటి విభా గంలోనే వర్ణించబడ్డది. మూడు విభాగాలలోనూ మొత్తం 1330 కురళ్ (ద్విపదలు) ఉన్నవి. ధర్మవిభాగంలో 38 అధ్యాయాలున్నవి. కురళ్‌లో మొదటగా చేయబడిన ప్రార్థన ఏ సంప్రదాయాన్నీ అనుసరించడం లేదు. విశ్వసృష్టికి సంబంధించిన వైదిక సిద్ధాంతం అందులో ప్రతిపాదించబడ్డది.

అకర ముదలేళుత్తెల్లామ ఆది
భగవన ముదత్రే ఉలగు

"అన్ని అక్షరాలూ అకారంతో ప్రారంభమవుతున్నవి. అదేవిధంగా సమస్త విశ్వమూ ఆది పురుషునితో ప్రారంభమవుతున్నది"

ఈశ్వరప్రార్థన తరువాత ధర్మమూ, దాని ప్రాముఖ్యతా వర్ణింపబడి చివర గృహస్థ వానప్రస్థాశ్రమములు వర్ణింపబడ్డవి. అర్థవిభాగంలో 70 అధ్యాయాలున్నవి. రాజులు, అమాత్యులు, సేన, శాసనవ్యవస్థ, అర్థనీతి మొదలగు అనేక విషయాలు అందులో వర్ణింపబడి ఉన్నవి. మొదటి ఐదు అధ్యాయాలలో సంయోగమూ, మిగి లిన అధ్యాయాలలో వియోగమూ వర్ణింపబడ్డది. తిరువళ్లువర్ సహృదయతా, జీవి తాన్ని నిశితంగా పరిశీలించ గలిగిన శక్తీ కామత్తుప్పావ్ విభాగంలో కన్పిస్తున్నది.

తిరుక్కురళ్‌లో మానవప్రకృతి గంభీరంగా అధ్యయనం చేయడమూ పరి శీలించడమూ కన్పిస్తున్నది. ఇందువర్ణింపబడిన ప్రేమ కామశాస్త్రాదులతో వర్ణింప బడిన ప్రేమకాదు. అది సంఘం కాలంనాటి ఆదర్శప్రాయమైన ప్రేమ. తమిళ జాతికి ఈ గ్రంథమంటే ఎంతో ప్రేమ, అభిమానము.

## సంఘోత్తర కాలము

100 నుండి 600 వరకు. క్రీ. శ. రెండవ శతాబ్దం ఉత్తరార్థంలో ఏకారణం వల్లనో మూడవ సంఘం గూడా విచ్ఛిన్నమైపోయింది. ఈ మూడవ సంఘమే

చివరి సంఘము. తరువాత సంఘగతంగా గాక వ్యక్తి గతంగా రచనలు ప్రారంభ మైనవి. జైన, బౌద్ధమత ప్రాబల్యం వలన ఈ కాలంలో అనేకమైన నీతిగ్రంథాలు రచింపబడ్డవి. వానిలో ఐదు మహాకావ్యాలు ప్రసిద్ధిని పొందినవి. (1) శిలప్పధి కారమ్ (2) మణిమేఖలై (3) జీవక చింతామణి (4) వలయాపతి (5) కుండలకేశి.

తమిళ సాహిత్యంలో మొదటి మహాకావ్యం శిలప్పధికారమ్. చేరనరేశుని సోదరుడు ఇలంగో ముని దీనిని రచించాడు. అతడు నడియౌవనంలోనే జైన ధర్మావలంబి అయినాడు. ఈ కావ్యంలో కణ్ణకి అనే సాధ్వి చరిత్ర వర్ణించబడ్డది. సతీత్వసంరక్షణకు ఈ కావ్యం ప్రతిపాదించే సందేశం. కణ్ణకి కథ తమిళ దేశంలో ఇంటింటా వ్యాపించింది. ఈకావ్యంలో రాజనర్తకులు, మృగయావినోదులు మొద లగువారి వర్ణనలూ, జానపద గీతనృత్య చిత్రణమూ ఉన్నవి. ఈ కావ్యంలో అచ్చటచ్చట గద్యం గూడా ఉన్నది. తమిళ గద్యానికి గూడా శిలప్పధికారమే మొదటి ఆధారగ్రంథము.

రెండవ మహాకావ్యం "మణిమేఖలై" కథ దృష్టితో చూస్తే ఈ గ్రంథం శిలప్పధికారానికి ఉత్తరార్థమని చెప్పవచ్చును. వేశ్య మాధవీ, కోవలన్- వీరిద్దరికి జన్మించిన కుమార్తె మణిమేఖల కథ ఈ కావ్యంలో వర్ణింపబడ్డది, కోవలన్‌చే త్యజించబడిన మాధవి బౌద్ధ భిక్షుకి అయిపోతుంది. బాల్యంలోనే తన కుమార్తెను గూడా భిక్షుకినిగా మార్చివేస్తుంది, రాజకుమారుడైన ఉదయకుమారన్ మణిమేఖలను ప్రేమిస్తాడు. కాని వారి ప్రేమ వివాహరూపంలో రూపొందదు. మణిమేఖల చివరి వరకు భిక్షుకిగానే ఉండిపోతుంది. మణిమేఖలై కావ్యరచయిత శీత్తలై చత్తనారు. అతడు మహాపండితుడు.

మూడవ కావ్యం జీవక చింతామణి. రచయిత తిరుత్తక్క తేవర. ఈకావ్యంలో జీవకుడనే రాజకుమారుని చరిత్ర వర్ణించబడ్డది. శ్రీ పురాణంలో వర్ణింపబడ్డ జీవకుడే ఈ కావ్యంలోని జీవకుడని పెద్దలంటున్నారు. సంస్కృత కావ్య రచనావిధానాన్ని దృష్టిలో పెట్టుకొని రచియింపబడిన మొతటి తమిళ కావ్యం జీవక చింతామణి అని చెప్పవచ్చును. ఈ కావ్యంలోని గేయాలు పాడడానికి అనువుగా ఉన్నవి. తరువాత కంబన్ గూడా ఈ కావ్యశైలినే అనుసరించాడు. మిగిలిన రెండుకావ్యాలూ ఇంకా దొరకలేదు. ఇతర గ్రంథాలలో లభించిన దానిని ఆధారంగా చేసుకొని ఇంతవరకు ఈ రెండుకావ్యాల కథలను మాత్రమే తెలుసుకొన గలిగాము,

ఈ ఐదు మహాకావ్యాలేగాక నీలకేశి, శూళామణి, యశోధరకావ్యం, నాగకుమార కావ్యం, ఉదయణన్ కథై మొదలగు కావ్యాలూ, ఖండకావ్యాలూ అనేకం ఆయుగంలో రచింపబడ్డవి.

(అనువాదం) సశేషం.

---

పుస్తక పరిచయం :

# ఖండకృతి

రచన : శాస్త్రి వేంకటనరసయ్య

ప్రకాశకులు : భారతీ సన్మానసంఘము, పామఱ్ఱు, కృష్ణాజిల్లా.

*1/8 క్రౌనుసైజున 42 పుటలలో 16 ఖండకావ్యాలు గల సంపుటి*

దీనికి ముందొక సమీక్ష, వెనుక పదిమంది పెద్దల అభిప్రాయాలు అయిదు పత్రికల రివ్యూలు పుస్తకాన్ని పొగడ్తలతో నింపుచున్నవి. కవికి సర్వోదయ సిద్ధాంతమన్నా, గాంధీతత్వమన్నా గౌరవము. వాటినిగురించి ఖండకావ్యములు ఛందోబద్ధమైన పద్యాలలో సరళసామాన్యమైన అభిప్రాయాలను వెల్లడించారు. ఈ సంపుటిలో వస్తువుకాని, రీతికాని శైలిగాని కవితా దృష్ట్యా గా లేదు. ఉన్న ఒకమంచి కవిత పుష్పవాంఛ అన్నది, మఖన్‌లాల్ చతుర్వేదీగారి 'పుష్ప్‌కీ చాహ్' అనే హిందీ కవితకు అధమరకం అనువాదం. దీనికి అద్భుతమైన కవితానువాదం వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు 'కాంక్ష' అను పేర ఎన్నడో చేశారు. తిరిగి వీరు చేయడం, అది విజ్ఞులు ఆమోదించడం, ఎక్కడా మాతృక సంగతి చెప్పకపోవడం ఆశ్చర్యం. పద్యాల రచనలో యతులకు, ప్రాసలకు, పాదపూర్తికి యీ రచయిత నానా శ్రమలూపడి, 'తేజమలర' 'వేగ' 'వసుధ' 'పుడమి' వంటి పడికట్టురాళ్లువేసి పూర్తి చేశారు. ఈ సంపుటిలో మచ్చునకు ఒక మంచి ఖండకావ్యమైనాలేదు సరిగదా, ఉన్నకావ్యాలన్నా పేలవంగా నీరసంగా ఉన్నప్పుడు ఇంతమంది పెద్దలు ఈ కావ్యాన్ని పొగడి రెండవ ముద్రణ కూడా వేయించుకోనిచ్చారంటే తెనుగు కవితా, దానిని ఆదరించే సహృదయుల అభిరుచీ ఎంత నికృష్టస్థితిలో ఉన్నదీ గ్రహించవచ్చు. తెనుగు

సాహిత్యములోని ఆత్మవంచనకు ఈ 'ఖండకృతి' ఒక నిదర్శనము. 'మాతృభూమి' యని 'ఆంధ్ర తమిళముల్, మైసూరు హైద్రాబాదు' అని ప్రారంభించి 'త్రిపుర భోపాలు మణిపూరు పెవుసు కచ్చి' అని చెప్పి చివర

పాటియాల విలాసపూర్ నీటు గుల్క
నండమాను నికోబారు గండు మీఱ
భరత భూమాత లోకాన బరగుగాత.

అని ముగించారు. ఈ కావ్యంలో వారు చెప్పదలచుకొన్నది భారత దేశంలోని రాష్ట్రాల జాబితా. అదికూడా ఇన్ని తప్పులకుప్పగా చెప్పిన నేర్పరులు ఈ యుభయ భాషా ప్రవీణులు. రెండవ కూర్పులో సైతము అట్టివి దిద్దుకొనే ప్రయత్నం కూడా చేయక తమ కీర్తి చంద్రికలలో దాగుడుమూతలాడటం సాహసమని చెప్పాలి.

## తొలికారు

*సాహితీ బంధుబృంద సంకలనమైన యీ గీతికా సంపుటిలో 44 గురు కవుల విభిన్న రచనలున్న సంపుటి.*

ప్రచురణ :

ఓరుగల్లు సాహితీ బంధుబృందం

1/8 క్రౌనుసైజు 92 పుటలు వెల : 1-0-0

ఈ పుస్తకానికి ముఖపత్రం తరువాత మూడు ముక్కలు మేలుబంతులుగా ప్రకటించారు. అందు మమ్మటుడు చెప్పిన శ్లోకమొకటి—

నియతికృత నియమ రహితాం
హ్లాదైకమయీాం అనన్య పరతంత్రాం
నవరస రుచిరాం నిర్మితి
మాదధాతి భారతీ కవేర్జయతి ...అని—

తరువాత విశ్వనాథవారి పద్యం :

యదభిముఖముగ చెప్పిరో అల్లదాని
తదభిముఖముగ చూచిన ధర్మమొప్పు
అపముఖమ్ముగ జూచిన అఖిలదోష
కలితముగ దోచు ధర్మ సంమాతమెల్ల ...అని—

చివర శ్రీ శ్రీ వి రెండు పంక్తులు

ప్రపంచమొక పద్మవ్యూహం
కవిత్వమొక తీరని దాహం

ఇవి మూడు మకుటాలు. ఈ 'తొలికారు' జల్లులోని మసకచీకటుల దారి తెలుసుకోవడానికి పై మూడు సుభాషితాలు కరదీపికలవంటివి. ఈ సంపుటి ప్రచురించిన 'సాహితీ బంధుబృందం' 'అవకాశం లేకుండా ప్రోత్సాహం లేక జారి పోతున్న ప్రతిభావంతులకు చేయూతగా' స్థాపించబడింది.

తెలంగాణా కేంద్రమైన ఓరుగల్లులో స్థాపితమైన ఈ సంస్థ తెలంగాణా లోని ఉదయోన్ముఖులైన ప్రతిభాసంపన్నులైన యువకవు లెందరినో ఆదరిస్తున్నది. ప్రయాణం ఉజ్వలభవితవ్యం వైపుకే. తత్ఫలితమే 'తొలికారు' అని చెప్పి, 'ఇందు పరిచయం చేయబడ్డ కవులందరూ ప్రతిభావంతులనేది నిస్సంశయమైన విషయం, వారిని ఆదరించి ప్రోత్సహిస్తే సాహిత్యం ఎంత సుసంపన్నమౌతుందో' అని ఆశావాదం వెలిపుచ్చుతున్నారు బృందంవారు. ఇందులో వెలువడిన రచనల ద్వారా యువకుల ప్రతిభ యెంతవరకు ప్రకాశించిందో పాఠకులు నిర్ణయించాలి. వీటిలో ఎక్కువభాగం ఆయా కవుల తొలిరచనలలాగే కనిపిస్తాయి. అయితే యివన్నీ పూర్వపద్ధతి పద్యాలలోనేగాక నేటికాలపు గేయాలలో, స్వేఛా ఛందస్సులలోనూ నుండా నడిచాయి. వీటి యన్నింటిమీదా యించుమించు ప్రసిద్ధకవులముద్రలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. అవి విరహగీతాలయితే వాటిలో కృష్ణశాస్త్రి, విప్లవ గీతాలయితే శ్రీ శ్రీ పలుకుతున్నారు. కొన్ని రచనలలో, మాటలతో కొత్త బొమ్మలు కట్టడానికి, భావాలతో కొత్త లోకం లోకి తీసుకొనిపోవడానికి, మృదుమధురమైన శైలితో ఛందస్సులు పరుగెత్తించడానికి ప్రయత్నం జరిగింది. అంతమాత్రంచేత పాఠకులు అమితానంద సంభరితులై హర్షించే సన్నివేశాలు లేవు. కొన్ని పంక్తులలో గడుసుదనం తొంగిచూస్తూవుంది.

కనుమూయవు చీకటి రొమ్ముమీద పసిచుక్కలు
పనిచేయవు పేకువటూకటిలో నిసి రెక్కలు

—*వేముగంటి*

ఇందులో భావకవిత్వం, అహంభావ కవిత్వం, దేశభక్తి కవిత్వం మొదలు అభ్యుదయ ప్రచార గేయాలవరకు అన్నిరకాల ధోరణులూ అనుకరించబడ్డాయి. **ఆఖరికి యెంకిపాటల అనుకరణ పాట కూడా ఉంది. ఈ 66 రచనలలో అనంద**

కావ్య యజ్ఞానికి అగ్నిహోత్రములు కాదగిన కావ్యములు లేవుకదా, అరణి మథించగావచ్చే విస్ఫులింగాలు కూడా లేవు. ఎంతసేపు మథించినా వచ్చే చప్పుడుమించి వెచ్చదనం కూడా లేదు. అయితే యిన్ని కవితా రచనలు ఒక్క చోట చేర్చడంలో, తెలంగాణాలో కొందరి యువరచయితల భావవైఖరులు తెలిసికోవడానికి ఒక వీలు కలిగింది. ఆదృష్ట్యా యీ ప్రచురణకర్తలు అభివంద నీయులు.

# సోమనాథ విజయము

రచన: నోరి నరసింహశాస్త్రి.

ప్రకాశకులు: నోరివారు, రేపల్లె

ఆరు రంగముల చరిత్రాత్మక నాటిక

1/8 క్రౌనుసైజులో 72 పుటలు — వెల: 1-0-0

సోమనాథ ఆలయంమీద ఘజనీ మహమ్మదు చేసిన దండయాత్ర ఫలితంగా ఆ దేవాలయం సర్వనాశనం అవడం ఆ లింగేశ్వరుని భగ్నంచేసి అందున్న ధన కనకరత్న రాసులను కొల్లగొట్టుకొనిపోయిన సన్నివేశం యీ నాటకానికి ఇతివృత్తం. మొత్తం ఇరవైమందిపైగా పాత్రలున్నప్పటికీ ప్రధాన పాత్రలన దగినవి మూడు. మహంతు, సోమనాథుడు, గిజ్నీ. అందుచేత కథ చెప్పడమంతా విష్కంభాల మీదుగానే జరిగింది. సముద్రతీరంలో సర్వజన సులభుడుగా ఉన్న సోమనాథునికి ఒక దండయాత్ర తరువాత విజయం సాధించి, అక్కడ భక్తులు పెద్ద ప్రాకారాలతో కోటలాగున దేవాలయం కట్టి పెద్ద గోపురాలతో గర్భాలయములో అంతరిక్షమందు ఆధారము లేకుండా లింగప్రతిష్ఠ చేసినారు. సువర్ణ రాసులు క్రుమ్మరించినారు. మహోత్సవాలు చేసినారు. పేదసాదలందరికీ సులభుడు కాకుండా వేలకొలదీ సువర్ణదీనారాలిచ్చిన వారికే స్వామి దర్శనం లభ్యమయ్యేటట్టు చేసినారు. ఇదిచూచిన ఒక అర్చకుడు సోమనాథుడు హర్షించ లేదు. ఆ దేవాలయమంత వైభవముగా నిర్మించి స్వామి అభిమతాన్ని ధిక్కరించినట్టు భావించాడు. తిరిగి సముద్రతీరంలో, అందరికీ అందుబాటులో ఉండేటట్టు స్వామి ప్రతిష్ఠచెయ్యాలని అతని కోరిక. అది యెవరూ వినలేదు. పైగా అతనికి పిచ్చి యెక్కిందనన్నారు. కాన స్వామి మ్లేచ్ఛుల వశంచేరి సర్వనాశనం చేస్తాడని సోమనాథుడు చెప్పినట్లేఅయినది. ఆలయము భూస్థాపితమైంది.

మూల విగ్రాట్టునుకూడా ముక్కలుచేసి సువర్ణ రత్నరాసులు కొల్లగొట్టి గజ్నీ నిష్క్రమించాడు. స్వామి తిరిగి సముద్రతీరానికి వచ్చాడు. ఈ రూపకంలో రంగస్థల ప్రదర్శనయోగ్యమైన ఘట్టాలు లేవు. శ్రవ్యకావ్యంగా వినిపించిన కొంతవరకు రక్తికట్టునేమో! 1924 లో ఏకాంకనాటికా రచనలో తొలి ప్రయత్నముగా వెలువడిన యీ నాటిక తిరిగి మూడవకూర్పులో వెలువడింది. దేవుడు ధనిక దరిద్ర భేదం లేక సర్వజనసులభుడుగా ఉంటాడనే ధర్మసూత్రాన్ని ప్రతిపాదించడానికి తప్ప ఈ నాటికలో నిర్మాణంకాని, పాత్ర చిత్రణగాని సంభాషణలు గాని ఏవిధమైన విశిష్టతను ప్రదర్శించ లేకపోతున్నవి. భాష గ్రాంథికమూకాదు, వ్యావహారికమూ గాని కృత్రిమ శైలిలోవుంది. ఈ చిన్ని నాటికలో సందర్భము లేకపోయినను చోళదేశపు భటులను వర్ణిస్తూ 'వాళ్లు నోరెత్తి మాట్లాడితే బుడబుడ ధ్వని పుట్టుతుంది' అనడం, 'రెండవ వేదానికి తల్లి ఐన ద్రావిడభాషను హాస్యమాడటం' మ్లేచ్ఛులను అనరాని మాటలనిపించడమూ సముచితంగా లేదు. ఈ నాటిక మూడవ ముద్రణ పొందినదనడానికి తగిన ఆకర్షణలేమియున్నవో పాఠక జనానీకమే గ్రహించాలి. ఈ నాటికలోని కొన్ని ప్రజాస్వామ్య సూత్రాలు ఈ కాలానికి అనుగుణముగావున్నా, మత విద్వేషాన్ని పురికొల్పే కొన్ని భాగాలు కొన్ని యుగాలవెనకకు లాగుకొనిపోతున్నవి. ఇటువంటి విరుద్ధభావాల సమ్మేళనమే ఈ నాటికలోని విశేషమేమో!

— 'శ్రీ వాత్సవ'

## కొమ్మూరి కథలు

ప్రచురణ:

*ఆదర్శ గ్రంథ మండలి, విజయవాడ* వెల: రూపాయి

కథా వాహిని శీర్షికను ఆదర్శ గ్రంథమండలి ప్రచురించిన కొమ్మూరి వేణుగోపాలరావుగారి కథలసంపుటి యిది. ఇందులో ఏడు కథ లున్నాయి.

'తల్లీ - పిల్లా' అనే కథలో తాను పోషించుకోలేని బిడ్డ ధనికుని చేతిలో పడాలనీ, ఏ ముష్టివాని చేతిలోనో పడి వాడి బ్రతుకుదెరువుకోసం దాని కండ్లో, కాళ్లో పోకూడదని కోరుకుంటుంది. కాని- చివరకు అలాగే జరిగింది. ఆ బిడ్డను ముష్టివాడు ఎత్తుకెళ్లి కళ్లు పొడిచేస్తాడు తన స్వార్థానికి.

ఆవిడ జరగరాదని పదేపదే అనుకుంటున్న పని జరుగుతుంది.

'వ్రాతలూ చేతలూ' అనే కథలో ఒక రచయిత బీదవాళ్లంటే మహా సానుభూతి ఉన్నట్టు కథలో వ్యక్తీకరిస్తాడు. నిత్యజీవితంలో (సరిగ్గా ఈ కథ వ్రాసేప్పుడు) మట్టుకు తన వ్రాతకు భంగం కలిగించాడని ఒక బిక్షుకునిపైకి పేపర్ వెయిట్ విసిరి గాయపరుస్తాడు.

అతని వ్రాతలకూ, చేతలకూ గల భేదాన్ని చక్కగా చిత్రించారు.

'అబద్ధాలు' అనే కథలో అరుంధతి అనే చిన్ననాటి స్నేహితురాలు వచ్చి- ఏభర్తా అబద్ధాలు చెప్పకుండా వుండడనే మాటొకటి చెప్పి శారదాంబలో ఒక తుఫానును రేకెత్తిస్తుంది. తన భర్త అలాంటివాడు కాడని నమ్మిన శారదాంబకు ఆశాభంగ మవుతుంది. అయితే ఏం? అరుంధతికి ఉత్తరంలో మాత్రం తన భర్త రహస్యాలు దాచని వాడనే అప్పటికీ అబద్ధం వ్రాస్తుంది.

భర్తనుంచి నిజం తెలిస్తే ఆనంద పడతానన్న శారదాంబ - తీరా అది తెలిశాక ఎంత దిగులు పడిందీ నేర్పుగా చిత్రించారు. అయితే—ఈ కథలో చివరి పేరా లేకుండావుంటే ఇంకా బాగుండే దనిపించింది.

'అతివృష్టి' అనే కథలో—తండ్రి వద్దని మొత్తుకుంటున్నా వినక ఒక విధవను పెళ్ళాడ్తాడు సుందరం. ఆవిడ భర్త ఇచ్చిన స్వేచ్ఛను దుర్వినియోగ పరుస్తుంది. కొన్నాళ్ళకు భర్త స్నేహితునితో లేచిపోతుంది. ఆ తర్వాత సుందరం తండ్రి ఇష్టమ్మీద మరో అమ్మాయిని పెళ్ళాడి—రాచి రంపాన పెడ్తాడు. ఆవిడ బావతో లేచిపోతుంది.

అవసరాన్ని మించిన స్వేచ్ఛ, వొత్తిడి ఎలాంటి అనర్థాలకు దారితీస్తుందో ఈ కథ స్పష్టంగా వ్యక్తీకరిస్తుంది.

'నిజం'లో తన భార్య ఫలాని వారింటికి వెళ్ళిందనే అభిప్రాయాన్ని ముందే నిర్ణయించుకున్న భర్త—అదేమాట అబద్ధమైనా నిజమని వొప్పుకొనేదాకా భార్యను వేధిస్తాడు.

తాననుకున్నదే నిజం అనే పంతం, ఎదుటివాళ్ళ చేతకూడా అలాగే అనిపించాలనే మంకూ ఎలా వుంటుందో ఈ కథ తెలుపుతుంది.

'మాతృదేవి'లో తన కుర్రాడు కొన్నాళ్ళనుంచి బడికెళ్ళక బొంకుతున్నాడని నిజం తెలుసుకున్న తల్లి కొడుకును బాగా కొడ్తుంది. తీరా వాడెక్కడో ఏడుస్తూ పడివుంటే వెళ్ళి హృదయానికి హత్తుకుంటుంది.

'పోరు కలిగించిన మేలు' అనేది కాస్త పెద్దకథ. ఇందులో—ఉద్యోగం లేక తండ్రితో పోట్లాడి వెళ్ళిన కొడుకు స్నేహితుని సాయంతో మరోచోట ఉద్యోగాన్ని సంపాదిస్తాడు. స్నేహితుని చెల్లెలితో పరిచయం కలిగి, అది పెళ్ళికి దారితీస్తుంది. పెళ్ళికిముందు ఆ అమ్మాయి బాల్య వితంతువని తెలుస్తుంది. తన తండ్రికి ఇష్టంలేకపోయినా పెళ్ళి చేసుకుంటాడు.

మొత్తమ్మీద వీరి కథలన్నీ చక్కగా వున్నాయి. కథలకు తగిన పేర్లు పెట్టడంలో తగినశ్రద్ధ తీసుకున్నా రనాలి.

వివిధ కథల్లోనూ సమస్యలు, సన్నివేశాలు వేరైనప్పటికీ వాటి ఫలితాలు మలుపులు మాత్రం ఒక్కటిగా వున్నాయనిపిస్తుంది. రచయిత ఒక స్పష్టమైన నిర్ణయంతో, ప్రయోజనంతో కథను నడుపుతున్నారని తోచింది. ఇదొక మంచి పద్ధతనాలి.

మంచి ఇతివృత్తాలతో, సహజమైన సస్పెన్సు, క్లయిమాక్సులతో వీరి కథలు సాగాయి.

తప్పకుండా చదవ వలసిన కథలనడంలో సందేహంలేదు.

—"కోలన్"

## మఱది

రచన: ఓగేటి శివరామకృష్ణ

ప్రచురణ: తిలక్ పబ్లికేషన్సు, ఖమ్మంమెట్టు

వెల: రూపాయి ముప్పావలా

అన్న వివాహం జరుగుతున్నప్పుడు తమ్ముడు రాజు వూరేగింపు పల్లకీలో తననూ ఎక్కించుకొమ్మంటాడు. అప్పటికే అనేకమంది పల్లకీ ఎక్కడం, దిగడం సాగించడంతో విసిగిన అన్న అందుకొప్పుకోడు. కొత్తగా వచ్చిన వదినైనా కూర్చోపెట్టుకుంటుందేమోనని అడుగుతాడు. ఒదిగి ఒదిగి కూర్చోలేక ఇబ్బంది పడ్తున్న వదిన కూడా నిరాకరిస్తుంది.

ఆ అవమానాన్ని భరించలేని రాజు వదిన మీద కక్ష కడ్తాడు. తాను—ఇల్లు వదలి అన్నవద్ద చదువుకుంటున్న రోజుల్లో కూడా పంతానికి వదినెతో మాట్లాడకుండా వెళ్ళదీస్తాడు.

చదువుకునే రోజుల్లోనే రాజు ఒక అమ్మాయిని ప్రేమించడం, అనేక అవాంతరాల తర్వాత ఆమెను రాజు వివాహ మాడడం జరుగుతుంది.

తిరిగి వారి పెళ్ళిలో వదినె తన కొడుకును త్రూరేగింపు పల్లకీలో కూర్చోబెట్ట బోతుంది. రాజు మొదట నిరాకరించినా తర్వాత తీసుకుంటాడు. తాను ప్రతీకారాన్ని జరిపానని తెలపడమే రాజు ఉద్దేశ్యం. అది నెరవేరుతుంది.

క్లుప్తంగా ఇదీ కథ.

ఒక మామూలు సంఘటనను తీసుకొని ఇంత పెద్ద కథను చాక చక్యంగా నడపడం అంత తేలికగాదు. శివరామకృష్ణగారు ఈ కార్యక్రమంలో చాలా వరకు కృతకృత్యు లయ్యారని చెప్పవచ్చు.

అయితే చివరిదాకా ఒక పిల్లవాని మనస్తత్వాన్ని చిత్రించ వలసి వచ్చినప్పుడు అతని మాటలు, చేష్టలు వయస్సుకు తగ్గట్టుగా వుంటే కథ మరీ నిండుగా, సహజంగా వుంటుంది. ఆ విషయంలో శివరామకృష్ణగారు మరికొంత శ్రద్ధ వహిస్తే ఇంకా బాగుండేది.

8 ఏండ్ల రాజు తనను పల్లకీలోకి తీసుకోమని వదినె నడిగితే ఆమె ఏం ఎందు కెక్కించుకోవాలి ? అని అంటే రాజు—

'నువ్వు నా వదినెవు గనుక' అంటాడు.

12 ఏండ్ల రాజు తన తల్లితో వదినెను గూర్చి చెబుతూ—'అవునే అమ్మా! ఎవరి భార్యలు వాళ్ళకు మంచివాళ్ళే. మీకు కోడలు మంచిదవడం అన్నయ్య అదృష్టం. నాకు మాత్రం ఒదిన...' అని అంటాడు.

అదే వయస్సులో వున్నప్పుడు—అతనికన్నా ఏణ్ణర్థం చిన్నదైన అమ్మా యికి అనేకసార్లు ప్రేమలేఖలు వ్రాస్తాడు. వాటిలో 'నా హృదయంలో ఒక పవిత్ర స్థానం నీకోసం ఖాళీగా వుంచానన్న సంగతి మాత్రం మరిచిపోకు' అనే ధోరణిలో వుంటాయి విషయాలు.

13 ఏండ్ల రాజు ఒక సందర్భంలో 'మనస్సు ఎప్పుడూ ఒకలా వుండదు కాదుటండీ. ఒకప్పుడు ఇష్టతను చూపింది- మరో సమయంలో అయిష్టత చూపుతుంది. ఒకప్పుడు మంచి అభిప్రాయం కలిగించింది- మరో సమయంలో చెడ్డ అభిప్రాయం కలిగిస్తుంది. అందువల్ల మనస్సును ఆ సమయాన్ని, కాలాన్ని బట్టి నిర్ణయం చేసుకోవలసి వస్తుంది' అనంటాడు.

ఈ సందర్భాల్లో మట్టుకు కుర్రవానికి మారుగా రచయిత కనిపిస్తున్నా రేమోననిపిస్తుంది.

ఇలాంటి కొద్దిపాటి లోపాలున్నా నవల కొత్త పద్ధతిలో చక్కగావుంది.

—"కోలన్"

SRAVANTI MAGAZINE Regd. H. 562



బాపూజీ వర్ధంతి జనవరి 30 వ తేదీన దేశమంతటా జరిగింది.

Edited, Printed and Published by V. Anjaneya Sharma, 327 Residency Road, Hyderabad-Dn. & Printed at Ajanta Printers, Mahakali St., Secunderabad.